# ధమ్మపదం

(పాళీ భాష)



తెలుగులోనికి అనువదించినవారు

శ్రీ మోక్షానంద స్వామి

నీలగిరి విహారము (ఆశ్రమము)

తిమ్మాపూర్, జి॥ నిజామాబాదు-503227.

"నమో తస్స భగవతో అరహతో సమ్మా సంబుద్ధస్స"

# బుద్ధ భగవానుడు

ఇప్పటికి రెండువేల అయిదువందల సంవత్సరముల క్రింద ఉత్తర బీహారు నందు కపిలవస్తు రాజధానిగా శాక్యుల గణరాజ్యమొకటి యుండెడిది దానికి శుద్ధోదనుడు రాజు అతనికి మాయాదేవి, మహాప్రజాపతి గౌతమి అని ఇరువురు భార్యలు కలరు గర్భవతియైన మాయాదేవి పుట్టింటికి పోవునపుడు మార్గమధ్యమున వైశాఖపూర్ణిమ నాడు లుంబినీవనములో ప్రసవించెను లేక లేక కల్గిన పుత్ర సంతానము వలన రాజు, ప్రజలు ఎంతయో సంతోషించి అతనికి సిద్ధార్థుడని పేరిడిరి సిద్ధార్థుడు జన్మించిన ఏడవరోజున తల్లియగు మాయాదేవి మరణించుట వలన పినతల్లి గౌతమి అతనిని పెంచి పెద్ద చేసెను

అన్ని విద్యలయందును ఆరితేరి యవ్వనములో అడుగుపెట్టిన సిద్ధార్థునికి యశోధర అను కన్యతో వివాహము జరిగెను పది సంవత్సరముల కాలము అతడు దాంపత్య జీవితము గడిపెను ధన సంపదలకు, భోగభాగ్యములకు కొదువ లేకుండెను కష్ట మన్నచో తెలియక, అల్లారుముద్దుగా పెరిగిన సిద్ధార్థుని మనస్సు అతి కోమలముగా నుండెను బాల్యము నుండియు తరచు అతడు బయటి ప్రపంచమును మరచి అంతర్ముఖావస్థను పొందెడివాడు,

గడించిన అయిదు వందల జన్మలుగా అతడు బోధిసత్త్వుడై (బుద్ధత్వమును గోరిసాధన చేయు వ్యక్తి) కరుణ, ముదిత, ఉపేక్ష మొదలగు దశ పారమితలను సంపాదించెను యీ జన్మమున అతడు బుద్ధుడై మహత్తరమైన బోధిజ్ఞానమును లోకమునకు ప్రకటింప వలసి యున్నది అట్టియెడ అతడు ఇంటిలో ఎట్లా ఉండగలడు !

ఒక దినమున సారథి ఛందకుడు రథమును తోలగా ఉద్యాన విహారమునకని బయలుదేరెను త్రోవలో భూమి పై బడి భరింపరాని వేదనతో కొట్టుకొను రోగిని చూసెను అతని చుట్టు మలమూత్రములు దుర్వాసన గొట్టు చుండెను ఈగలు ముసిరి యుండెను అదిచూసి అతని మనస్సు వికలమై ఉద్యానమునకు పోవక ఇంటికి తిరిగి వచ్చెను రెండవ రోజు ఒక వృద్ధుడు కన్పించెను అతని తల తెల్లగా, ముగ్గుబుట్టవలె నెరసి యుండెను చర్మము ముడుతలు పడి యుండెను నడుమువంగి పోయి, ఊత కర్రను సహాయముగాగొని నడచుచుండెను పళ్లూడిపోయి, కళ్ళు కన్పించక, చెవులు విన్పించక పోగా దీనుడై దిక్కులు చూచు ఆ ముదుసలిని చూసి బాధాపూర్ణ హృదయుడై సిద్ధార్థుడు ఇంటికి తిరిగి వచ్చెను మూడవ రోజు నలుగురు వ్యక్తులు పాడెపై మోసికొనిపోవు శవమును చూసెను మృతుని బంధుమిత్రులు దుఃఖార్తులై రోదనము చేయు చుండిరి యీ లోకము అనిత్యమని, సుఖభోగములు, మూన్నాళ్ళ ముచ్చటలని అతనికి స్పష్టమయ్యెను నాలుగవ రోజు ప్రశాంతమైన చూపులతో ప్రసన్నవదముతో ముందుకుపోవు

కాషాయ వస్త్రధారియైన సన్యాసి కన్పించెను అతని వలె తానును సన్యాసియై లోకుల కష్టముల తొలగించుటకు, దుఃఖనివారణకు మార్గము కనుగొన వలెనని నిశ్చయించెను

ఆనాడే అతనికి కుమారుడు జన్మించెను సకలభోగ సంపూర్ణమైన రాజ్యము కాని, అనురూపవతియగు భార్య కాని నవ జాత శిశువు కాని అతనిని వెనుకకు మరల్చలేక పోయిరి ఆ రాత్రే సిద్ధార్థుడు ఇంటి నుంచి వెడలి పోయెను అప్పటికి అతని వయస్సు ఇరువది తొమ్మిది సంవత్సరములు

సన్యాసియై సిద్ధార్థుడు మొదట ఆలారకాలాముడను గురువు వద్దజేరి,అతడు బోధించు "ఆంకిన్యాయతన సమాధి 'ని సాధించెను అది పూర్ణజ్ఞానము కాకుండుటచే ఉద్దక రామపుత్రునిజేరి నైవసంజ్ఞా నాసంజ్ఞాయతన సమాధి"ని సాధించెను దానివలన కూడా దుఃఖాం తమును పొందజాలక మగధ యందలి ఉరువేలమున ఆరు సంవత్సరములు కఠోరమైన తపస్సు చేసెను అయినను శాంతి లభింపక శరీరబాధకములగు కఠిన తపశ్చర్యలను వదలిపెట్టెను

ఉరువేలము నందు సుజాత యను కన్య యుండెను ఆమె కులశీలము లందు తనకనువైన భర్త లభించి మొదటి కాన్పున పుత్రుడు జన్మించినచో నైవేద్యము సమర్పింతునని వృక్ష దేవతకు మ్రొక్కియుండెను ఆమె కోర్కెలు నెరవేరుట వలన ఆ వైశాఖ పూర్ణిమ నాడు అదే బోధి వృక్షము క్రింద ఆసీనుడై యున్న సిద్ధార్థునికి మధురమైన పాయసమును నివేదించి వెడలి పోయెను,

సుజాత ఇచ్చిన పాయసమును నేరంజరా నదీ తీరమున భుజించి ఆ పగలంతయు పూచిన సాల (టేకు) వనములో విహరించెను సాయంత్రమున చిరువెన్నెలలు కురియువేళ బోధి వృక్షము క్రిందకు వచ్చి' తూరుపు మొగమై పిడుగులకును చెదియని అపరాజితమగు ఆసనమున ఉపవిష్టుడయ్యెను ' తన్ను భంగ పరచుటకై నలువైపులనుండి ముట్టడించు మారుని (మాయ, యముడు, మన్మథుడు) మారసైన్యమును పటాపంచలొనర్చి, ఆరాత్రి మొదటి జామున అనేక పూర్వ జన్మములను, రెండవ జామున దివ్యనేత్రమును, మూడవ జామున' ప్రతీత్యసముత్పాద ' జ్ఞానమును పొందెను జీవుల దుఃఖమునకు కారణమును, దానిని నివారించు ఉపాయమును కనుగొనెను, అచలప్రశాంతమగు ఆ విముక్తి ఆనందమున నలుబది యొక్క రోజులు గడపెను

'ప్రతీత్యసముత్పాద' మనగా, 'దీనివలన ఇది కలుగు చున్నది ' అను కార్య కారణ సంబంధ వివరణము దుఃఖమునకు మూలకారణము అవిద్య అవిద్య వలన సంస్కారములు, సంస్కారముల వలన విజ్ఞానము, విజ్ఞానము వలన నామరూపములు, నామరూపముల వలన షడాయతనములు (జ్ఞానేంద్రియములైదు, మనస్సు) షడాయతనముల వలన స్పర్శ, స్పర్శవలనవేదన వేదన వలనతృష్ణ, తృష్ణవలన ఉపాదానము (రాగము) ఉపాదానము వలన భవము, భవము వలన జాతి, జాతి వలన జరా మరణములు కల్గుచున్నవి సంసార చక్రమిట్లు ప్రవర్తిల్లు చున్నది

యీ భవ చక్రమును నిరోధింప గోరువాడు మొదట నాలుగు ఆర్యసత్యములను గమనింపవలెను అవి 1) యీ లోకము దుఃఖ మయము అనగా యీ సకల ప్రపంచము జన్మజరలచే, దుఃఖ దౌర్మనస్యములచే, సంయోగ వియోగములచే అట్టుడికి పోవుచున్నది జన్మ దుఃఖము, వ్యాధి దుఃఖము, జరామరణములు దుఃఖము, ప్రియ వియోగము దుఃఖము, అప్రియ సంయోగము దుఃఖము ఇట్లు లోకమును దుఃఖమయముగా గుర్తించి, విరక్తుడై ముక్తి సాధనము పూనుకొన వలెను 2) ఆ దుఃఖమునకు కారణమున్నది అదియే అవిద్య 3) ఆ అవిద్యను తొలగింప వచ్చును 4) అందుకు మార్గమున్నది అది అష్టాంగమార్గము ఆ ఎనిమిది అంగములు ఇవి 1) సమ్యక్ దృష్టి 2) సమ్యక్ సంకల్పము 3) సమ్యక్ వచనము 4) సమ్యక్ కర్మ 5) సమ్యక్ జీవనము 6) సమ్యక్ వ్యాయామము 7) సమ్యక్ స్మృతి 8) సమ్యక్ సమాధి

ఇప్పుడు సిద్ధార్థుడు బుద్ధుడయ్యెను ఇక ఉరువేలము నుండి బయలుదేరి వారణాసి పురసమీపమున గల ఋషిపతన మృగదావమున నున్న అయిదుగురు భిక్షువులకు (సాధనాకాలములో తనను సేవించిన వారు) తన ధర్మమును బోధించుటతో ధర్మచక్ర ప్రవర్తనమును ప్రారంభించెను నాటి నుండి 45 సంవత్సరములు ఎడ తెగని ధర్మప్రచార మొనరించెను ఋషిపతనము నుండి ఉరువేలమునకు తిరిగివచ్చి వేయిమంది జటిలబ్రాహ్మణులను బౌద్ధ ధర్మమున చేర్చుకొనెను అటనుండి రాజగృహము చేరుకొని

రాజు బింబిసారునికి, అచటి ప్రజలకు ధర్మోపదేశము చేసెను ఇక్కడ అతని - సారిపుత్ర, మౌద్గల్యాయనులను ప్రతిభావంతులగు శిష్యులు లభించిరి ఆ తరువాత కాశీ, కోసల, వజ్జి మొదలగు జనపదములందు మూల మూలలను పాదచర్య యొనరించి సరళముగా తన సిద్ధాంతములను ప్రచారము చేసెను ఆయన జీవితకాలములోనే ఉత్తర భారతదేశమందంతటను బౌద్ధ ధర్మము వ్యాపించెను

ఆయన పశుబలులను, యజ్ఞయాగాదులను, హేతు విరుద్ధములగు తదితర సంప్రదాయములను చీల్చిచెండాడెను అట్టి సంఘములో బ్రాహ్మణుడు మొదలుకొని చండాలుని వరకు ప్రతి యొక్కనికిని జ్ఞానమును సాధించుటకు అర్హత కలదని, అందరు సమానులే యని ఎలుగెత్తి చాటెను ప్రతిభా పూర్ణమును, ఉజ్జ్వలముగు ఆయన వ్యక్తిత్వము ముందు ఆనాటి బ్రాహ్మణులు, ప్రకుధ కాత్యాయనుడు, నిగంఠనాత పుత్రుడు, సంజయ వేలట్ఠి పుత్రుడు మొదలగు గురువులు సూర్యుని ముందు మిణుగురు పురుగుల వలె వెల వెల బోయిరి

తథాగతుడు (సత్యమార్గమున నడచినవాడు) తన జీవితములోని చివరి సంవత్సరమును రాజగృహ నగరములో గడపెను ఇచట నుండి అంతిమ యాత్రను ప్రారంభించి అమ్రయష్టి, పాటలిగ్రామము, కోటి గ్రామముల మీదుగా వైశాలి నగరమును చేరి ఆమ్రపాలి వేశ్య యొక్క మామిడితోటలో విడిది చేసెను

మరునాడు బుద్ధప్రముఖ భిక్షు సంఘమునకు విందు చేసి ఆమ్రపాలి తన తోటను సంఘమునకు సమర్పించెను ఇంతలో వర్షఋతువేతెంచెను బుద్ధుడు ఆయాచోట్ల వర్షావాసము గడపుటకై భిక్షువులకు అనుజ్ఞయిచ్చి, తాను వెలు గ్రామమున నిలిచి పోయెను ఇచట అస్వస్థుడైనను తిరిగి కోలుకొనెను ఆనందునితో చాపాల చైత్యమున విహరించు నప్పుడు బుద్ధుడు ఆయుఃసంస్కారము (జీవితేచ్ఛ)ను వదలి పెట్టెను అచటినుండి మహావన కూటాగార శాలకు వచ్చి భిక్షువులకు సందేశమిచ్చి ధర్మమును వ్యాఖ్యానించెను తరువాత భండ, ఆమ్ర, జంబూ గ్రామముల మీదుగా భోగ నగరమును చేరుకొనెను పావాయందు చుందుడను కమ్మరి యింట భుజించిన పిదప మరల అస్వస్థుడయ్యెను పావానుంటి కుశీనారము పోవుచుండగా "ఆనాటి రాత్రి కడజామున కుశీనారములోని మల్లుల ఉపవర్తన సాలవనమున జంట టేకు చెట్ల మధ్య తాను మహాపరి నిర్వాణము (దేహత్యాగము) చెందగల" నని ప్రకటించెను హిరణ్యవతి నదియొక్క అవలి తీరమున కుశీనారములోని సాలవనమున తన అంతిమఘడియలలో సుభద్రునికి భిక్షు దీక్ష నిచ్చెను చివరకు అచట ఆసీనులై యున్నవారిని ఉద్దేశించి "భిక్షు వులారా! సర్వ సంస్కారములు అనిత్యములు సోమరి తనమును వీడి, జీవన లక్ష్యమును సాధింపుడు !" అని పల్కెను ఇవియే తథాగతుని చివరిమాటలు

అది క్రీ పూ 483 వ సంవత్సరమున వైశాఖ పూర్ణిమ ఆ రాత్రి కడజామున తన 80వ ఏట బుద్ధుడు మహాపరి నిర్వాణము

చెందెను భిక్షువు మహాకాశ్యపుడు చితికి నిప్పంటించెను ద్రోణుడను బ్రాహ్మణుడు అస్థులను స్తూపనిర్మాణార్థమై, అజాత శత్రువుకు, లిచ్ఛవి, కపిలవస్తు, అల్లకప్పము మొదలగు గణరాజ్యములకు పంచి పెట్టెను

లోకోత్తరుడైన ఆ మహా పురుషుని జీవితము యొక్క సంక్షిప్త పరిచయ మిది

—*—

# ధ మ్మ ప ద ం

ప్రాచీన కాలమున ఉత్తర భారతదేశము నందు శ్రావస్తి, రాజగృహము, వైశాలి,కపిలవస్తు మొదలైనవి మహా నగరములు బౌద్ధ ధర్మము వ్యాప్తి నందిన పిమ్మట యీ నగరము లన్నింటను వారి విహారములు (ఆశ్రమములు) వెలసెను అనాథ పిండకుడు, మహాఉపాసిక విశాఖదేవి, బింబిసారుడు ఆదిగాగల ధనవంతులు, రాజులు ధర్మప్రచారోద్యమమునకు చేయూతనిచ్చిరి బుద్ధుని మహనీయ వ్యక్తిత్వముచే ఆకర్షితులై వేలకొలది జనులు ఇండ్లు, వాకిండ్లను వదలి సన్యసించి, జ్ఞాన సాధనకే జీవితముల నంకితము చేసిరి

పరివ్రాజకులు వర్షాకాలము నాలుగునెలలు ఆయా చోట్లగల తమ ఆరామ, విహారములందు గడిపెడివారు తక్కిన ఎనిమిది నెలలు భిక్షాటనము చేయుచూ నగరములందు, నిగమములందు, జనపదములందు ధర్మప్రచార మొనరించుచూ పర్యటించెడి వారు అందువలన వారికి భిక్షువులను పేరు స్థిరపడినది ధమ్మపదము నందలి గాథల (శ్లోకముల)లో చాలా వరకు శ్రావస్తి యందలి జేతవనము నందే చెప్పబడినవి ఇవి బుద్ధుడు, బౌద్ధ ధర్మము ననుసరించిన ఉపాసికా ఉపాసకులు (గృహస్థులగు స్త్రీ పురుషులు) భిక్షుణీ భిక్షువులు ఆయా సందర్భములందు చెప్పినవి ఒకటి రెండు

చోక్ల పకి సంప్రదాయమునకు చెందిన సాధువులు కూడా కన్పింతురు

ధమ్మపదము పరిమాణమున చిన్నదైనను, విస్తారమైన బౌద్ధ వాఙ్మయమున, బౌద్ధ వాఙ్మయమునందే కాదు, ప్రపంచ శాస్త్ర సాహిత్యమునందే దానికిగల స్థానము మహనీయమైనది బౌద్ధ ధర్మ మూల గ్రంథములగు వినయ,సుత్త, అభిధమ్మ పిటక ములలో ఇది సుత్తపిటకములోని ఖుద్దకనికాయమున గల రెండవ సంకలన గ్రంథము బుద్ధుని మహాపరి నిర్వాణము తరువాత జరిగిన ప్రథమ సంగీతి (ధర్మమును నిశ్చయించుటకై జరిగిన బౌద్ధ పరివ్రాజకుల సమ్మేళనము) నాటికే ధమ్మపదము సంకలితమైనది లంకా నరేశుడైన వట్టగ్రామణి (క్రీ పూ 88-76) కాలము నుండి లిఖితరూపములో లభించు చున్నది నాటినుండినేటి వరకు దానిలో ఎట్టి మార్పులు జరుగ లేదు

ధమ్మ పదమనగా నేమి? ధర్మమును తెలుపు పదములు అని పదమనగా మాట యని, పాటయని రెండర్థములు కలవు 'పదము'ను పాటకు పర్యాయముగా వాడుట యీ నాడు కూడా పల్లెలందు కన్పించును ఇందలి గాథలు కూడా పాడు కొనుట కనువైనవి కనుక వీటిని పదములనుటయే సబబుగా నుండును

ఈ అనువాదమునకు సాహిత్య భండార్ ' మీరట్ వారు ప్రకటించిన ప్రొ సత్యప్రకాశ శర్మగారి హిందీ అనువాదముతో గల మూలము ఆధారము శ్రీ శర్మ గారి అనువాదము నాకెంతయో

ఉపకరించుట వలన యీ సందర్భమున వారికి కృతజ్ఞతలు తెలుపు కొనుట నాకనీస కర్తవ్యము ఇక పాఠకులు 5వ శ్లోకము యొక్క తాత్పర్యమునకు "ఇదియే సనాతన ధర్మము" అను వాక్యము చేర్చియు, 49వ తాత్పర్యమును "తుమ్మెద పూలయొక్క రంగు వాసనలకు హాని కల్గించకుండా, మకరందమును కొనిపోవు నట్లు భిక్షువు గ్రామము నందు భిక్షాటనము చేయవలెను' అనియు చదువుకొనవలెను

చివరన

యీ గ్రంథముద్రణకై విరాళమురిచ్చిన సహృదయులకూ, ముద్రణ సమయమున సకల విధముల సహకరించిన శ్రీ జె యస్ ప్రభులింగం గారికీ, మరియు వారి శ్రీమతి సుజాత గారికీ,

మిత్రులు శ్రీ అర్జున గౌడు గారికీ,

గ్రంథమును అందముగా ముద్రించిన ప్రీమియర్ ప్రెస్ అధిపతి శ్రీ కృష్ణమూర్తిగారికీ, ప్రెస్సు కార్మికులకూ,

హృదయ పూర్వక కృతజ్ఞతలు

28-6-1969
సికింధరాబాధు.

మోక్షానంద స్వామి

# వి ష య సూ చి క

# ధమ్మపదం

## యమకవగ్గో పఠమో

### యమకవర్గము ప్రథమాధ్యాయము

స్థానము శ్రావస్తి　　　　వ్యక్తి చక్షుపాలథేరుడు

శ్లో॥ మనోపుబ్బఙ్గమా ధమ్మా మనోసెట్ఠా మనోమయా।
మనసాచే పదుట్ఠేన భాసతివా కరోతివా।
తతోనం దుఃఖమన్వేతి చక్కంవ పహతో పదం॥

తాత్పర్యము - అన్ని ధర్మములకు మనస్సేమూలము మనస్సేశ్రేష్ఠమైనది ధర్మములన్నియు మనోమయమైనవే అందువలన ఎవరైనను చెడుమనస్సుతో మాట్లాడినా, పనిచేసినా ఎద్దును బండి చక్రమనుసరించునట్లు దుఃఖం వారిని వెంటాడును 1

స్థానము శ్రావస్తి　　　　వ్యక్తి మట్ఠకుండలి

శ్లో॥ మనోపుబ్బఙ్గమా ధమ్మా, మనోసెట్ఠా మనోమయా।
మనసా చే పసన్నేన భాసతి వా కరోతి వా।
తతోనం సుఖమన్వేతి ఛాయా వ అనపాయినీ॥

తా॥ అన్ని ధర్మములకు మనస్సే మూలము ధర్మము లన్నియు మనోమయమైనవి మనస్సే శ్రేష్ఠమైనది ఎవరైనా ప్రసన్నమైన మనస్సుతో మాట్లాడినా, పనిచేసినా కష్టమును తొలగించు చల్లని వృక్షచ్ఛాయవలె సుఖము అతని ననుసరించును 2

స్థానము జేతవనము (శ్రావస్తి) వ్యక్తి స్థూలతిష్యథేరుడు

శ్లో॥ అక్కోచ్ఛిమం అవధి మం, అజిని మం అహాసిమే ।
యే చ తం ఉపనయ్హన్తి, వేరం తేసం న సమ్మతి॥

తా॥ అతడు నన్ను తిట్టెను, కొట్టెను, ఓడించెను మరియు నాధనము నపహరించెను ఇలా ఆలోచించేవారి మనస్సులో వైరమెప్పటికిని శాంతింపదు 3

శ్లో॥ అక్కోచ్ఛిమం అవధిమం, అజినిమం అహాసిమే ।
యే తం న ఉపనయ్హన్తి, వేరం తేసూపసమ్మతి॥

తా॥ అతడు నన్ను తిట్టెను, కొట్టెను, ఓడించెను మరియు నా ధనమునపహరించెను ఇటువంటి ఆలోచనలను మానిన వారి మనస్సులో వైరం శాంతించును 4

స్థానము శ్రావస్తి జేతవనము వ్యక్తి కాలియాక్షిని

శ్లో॥ న హి వేరేన వేరాని, సమ్మన్తీధ కుదాచనం ।
అవేరేన చ సమ్మన్తి, ఎస ధమ్మో సనన్తనో॥

తా॥ వైరముతో వైరమెప్పుడును శాంతింపదు అది అవైరముతో (ప్రేమతో) నే శాంతించును 5

స్థానము జేతవనము వ్యక్తి కోసంబక భిక్షువు

శ్లో॥ పరే చ నవిజానన్తి మయమేత్థ యమామసే।
యే చ తత్థ విజానన్తి, తతో సమ్మన్తి మేధగా॥

తా॥ యీ లోకమున మనకు మరణము తప్పదని గ్రహించని వారెందరోగలరు కాని యీ సత్యమును గ్రహించిన వారు వెంటనే తమ కలహములను శాంతింప జేసుకొందురు 6

స్థానము శ్రావస్తి వ్యక్తులు చుల్లకాలుడు, మహాకాలుడు

శ్లో॥ సుభానుపస్సిం విహరన్తం, ఇంద్రియేసు అసంవుతం।
భోజన్మిహ అమత్తఞ్ఞం, కుసీతం హీనవీరియం।
తంవేపసహాతి మారో, వాతో రుఖ్ఖం వ దుబ్బలం॥

తా॥ సంసారమునసర్వము శుభమని తలంచుచూ,ఇంద్రియ నిగ్రహము లేక భోజనమున పరిమితిని గుర్తింపక, సోమరియై, వీర్యహీనుడై యున్నవానిని, గాలి దుర్బల వృక్షమును పెకల్చి వేయునట్లు మారుడు పతనము చేయును 7

శ్లో॥ అసుభానుపస్సిం విహరన్తం, ఇంద్రియేసుసుసంవుతం।
భోజన్మిహ చ మత్తఞ్ఞం, సద్ధం, ఆరద్ధ వీరియం।
తంవే న పసహాతి మారో వాతోసేలం వ పబ్బతం॥

తా॥ లౌకికమైన సర్వము అనిత్యమశుభమని గ్రహించి, ఇంద్రియములను చక్కగా నిగ్రహించి, భోజనమున పరిమితిని గుర్తించి శ్రద్ధతో పరాక్రమించు వానిని, పర్వతమును గాలికదల్ప జాలనట్లుగా మారుడు పతనం చేయజాలడు 8

స్థానము : జేతవనము వ్యక్తి దేవదత్తుడు

శ్లో॥ అనిక్కసావో కాసావం, యో వత్థం పరిదహేస్సతి।
అపేతో దమ సచ్చేన, న సో కాసావమరహతి॥

తా॥ అపరిశుద్ధుడుగా నుండి కాషాయ వస్త్రధారణ చేయువాడు ఇంద్రియ నిగ్రహపరుడు కాక పోవటంవల్ల సత్యదూరుడై కాషాయ వస్త్రధారణకు అనర్హుడగుచున్నాడు 9

శ్లో॥ యో చ వన్తకాసావస్స, సీలేసు సుసమాహితో।
ఉపేతో దమసచ్చేన, సవే కాసావమరహతి॥

తా॥ పరిశుద్ధుడు, శీలవంతుడు, ఇంద్రియ నిగ్రహపరుడు సత్యవంతుడు కాషాయ వస్త్రధారణకు అర్హుడు 10

స్థానము వేణువనము వ్యక్తి సంజయఅగ్రశ్రావకుడు

శ్లో॥ అసారే సారమతినో, సారే చాసార దస్సినో।
తే సారం నధిగచ్ఛన్తి, మిచ్ఛాసంకప్పగోచరా॥

తా॥ అసారమును (లోకమును) సారమని సారమును (నిర్వాణమును) అసారమని తలంచి మిథ్యా సంకల్పములను దర్శించు వ్యక్తులు సార వస్తువును పొందజాలరు 11

శ్లో॥ సారం చ సారతో ఞత్వా, అసారంచ అసారతో ।
తే సారం అధిగచ్ఛన్తి సమ్మా సంకప్పగోచరా ॥

తా॥ సారమును సారమని, అసారమును అసారమని గ్రహించి సమ్యక్ సంకల్పములను దర్శించు వారు సారవస్తువును పొందగలరు 12

స్థానము జేతవనము వ్యక్తి నందథేరుడు

శ్లో॥ యథా అగారం దుచ్ఛన్నం, వుట్ఠీ సమితి విఝ్ఝతి ।
ఎవం అభావితం చిత్తం, రాగో సమితివిఝ్ఝతి ॥

తా॥ చక్కగా కప్పబడని ఇంటిలోనికి వాననీరు ప్రవేశించు నట్లే చక్కగా నిగ్రహింపబడని చిత్తం లోనికి విషయరాగము ప్రవేశించును 13

శ్లో॥ యథా అగారం సుచ్ఛన్నం, వుట్ఠీ న సమితివిఝ్ఝతి ।
ఎవం సుభావితం చిత్తం, రాగో న సమితి విఝ్ఝతి ॥

తా॥ చక్కగా కప్పబడిన ఇంటిలోనికి వర్షపునీరు ప్రవేశింపనట్లు చక్కగా నిగ్రహింప బడిన చిత్తంలో విషయాసక్తి ప్రవేశింపదు

రాగం చ దోసం చ పహాయ మోహం, సమ్మప్పజానో
సువిముత్తచిత్తో।
అనుపాదియానో ఇధ వా హురంవా, సభాగవా
సామఞ్ఞస్సహోతి॥

తా॥ శాస్త్రముల గురించి కొంచెమే మాట్లాడినా వాటిని ఆచరించు ధర్మానుసారి రాగ ద్వేషమోహములనుండి ముక్తుడై, సమ్యక్ప్రజ్ఞాయుక్తుడై, చింతారహిత చిత్తుడగును అట్టివాడే శ్రమణు డగుటకు యోగ్యుడు 20

# 2. అప్పమాదవగ్గో దుతీయో

## అప్రమాద వర్గము ద్వితీయాధ్యాయము

స్థానము ఘోషితారామము (కోశాంబి) వ్యక్తి రాణిసామావతి

శ్లో॥ అప్పమాదో అమతపదం, పమాదో మచ్చునో పదం।
అప్పమత్తా న మీయన్తి, యే పమత్తా యథా మతా॥

తా॥ జాగరూకతయే అమృత పదము అజాగ్రత్తయే మృత్యుపదము అప్రమత్తులెన్నడూ మరణించరు ప్రమత్తులు జీవన్మృతులే 21

శ్లో॥ ఎతం విసేసతో ఞత్వా, అప్పమాదమ్హి పణ్డితా
అప్పమాదో పమోదన్తి, అరియానం గోచరే రతా॥

తా॥ పండితులీ జాగరూకతను విశేషముగా నెరింగి, అప్రమత్తత యందానందించుచూ ఆర్యజ్ఞానాచరణలో నిమగ్నులగుదురు 22

శ్లో॥ తే ఝాయినో సాతతికా, నిచ్చం దళ్హపరక్కమా।
ఫుసన్తి ధీరా నిబ్బాణం, యోగక్ఖేమం అనుత్తరం॥

తా॥ ఏమరుపాటుగా నుండువారిలో ప్రయత్నశీలురును నిద్రితులలో జాగృతులునై యుండు బుద్ధిమంతులు, వేగముగా పరుగెత్తు గుర్రము బలహీనమగు గుర్రమును దాటి పోవునట్లుగా ముందంజ వేయుదురు 29

స్థానము కూటాగారశాల (వైశాలి) వ్యక్తి మహాలి

శ్లో॥ అప్పమాదేన మఘవా, దేవానం సెట్ఠతం గతో ।
అప్పమాదం పసంసన్తి, పమాదో గరహితో సదా॥

తా॥ అప్రమత్తుడగుట వలన దేవతలలో ఇంద్రుడు శ్రేష్ఠుడయ్యెను అప్రమత్తతనందరు ప్రశంసింతురు ఏమరుపాటు సదా నిందార్హమైనది 30

స్థానము జేతవనము వ్యక్తి ప్రజ్ఞతర భిక్షు

శ్లో॥ అప్పమాదరతో భిక్ఖూ, పమాదే భయదస్సివా ।
సంయోజనం అణుంథూలం, డహం అగ్గి వా గచ్ఛతి॥

తా॥ జాగరూకత యందానందించు భిక్షువు, అజాగరూకత యందు భయము నుంచువాడు చిన్నవి మరియు పెద్దవియగు బంధములను అగ్నివలె కాల్చుచూ ముందుకు పోవును 31

స్థానము జేతవనము వ్యక్తి తిష్యథేరుడు (నిగమవాసి)

శ్లో॥ అప్పమాదరతో భిక్ఖు, పమాదే భయదస్సి వా।
అభబ్బో పరిహానాయ, నిబ్బాణస్సేవ సన్తికే॥ 12॥

తా॥ జాగ్రత్త యందానందించు భిక్షువు, అజాగ్రత్త యందు భయము నుంచువాడు పతనం కాజాలడు నిర్వాణమునకు (ముక్తికి) సమీపమున నున్నాడు 32

తా॥ చిత్తము అస్తవ్యస్తముగా నున్నవాడు, సద్ధర్మము నెరుంగనివాడు మనశ్శాంతి లేనివాడు పూర్ణప్రజ్ఞుడు కాజాలడు 38

శ్లో॥ అనవస్సుత చిత్తస్స, అనన్వాహత చేతసో॥
పుఞ్ఞపాపహీనస్స, నాత్థి జాగరతో భయం॥

తా॥ చిత్తమలములు క్షీణించినవారు, నిశ్చలహృదయులు, పుణ్యాపాప విహీనులు అగు జాగృతులకు భయం లేదు 39

స్థానము - శ్రావస్తి వ్యక్తి - విపస్యక భిక్షు

శ్లో॥ కుంభూపమం కాయమిమం విదిత్వా, నగరూపమం
చిత్తమిదం ఠపేత్వా।
యోధేథ మారం పఞ్ఞాయుధేన, జితం చ రక్ఖే
అనివేసనో సియా॥

తా॥ ఈ దేహము మట్టికుండ వంటిదని గ్రహించి, ప్రాకారావర్తమైన నగరమువలె చిత్తమును సురక్షిత మొనరించి ప్రజ్ఞా (స్మృతి) రూపమగు ఆయుధమును ధరించి మారునితో యుద్ధము చెయవలెను ఆ యుద్ధములో గెలచిన తాను ఇల్లువిడిచి స్వరక్షణలో నిమగ్నమై యుండవలెను 40

స్థానము - శ్రావస్తి వ్యక్తి - పూతిగత్త తిష్యథేరుడు

శ్లో॥ అచిరవతయం కాయో, పఠవిం అధిసేస్సతి।
ఛుద్దో అపేతవిఞ్ఞాణో, నిరత్థం వ కలింగరం॥

తా॥ ఎంత దుఃఖం! యీ తుచ్ఛశరీరము, చైతన్య (విజ్ఞాన) రహితమైన కట్టెవలె త్వరలోనే నేలబడును 41

స్థానము - కోసలజనపదము  వ్యక్తి - నందగోపాలుడు

శ్లో॥ దిస్సోదిసం యం తం కాయిరా, వేరో వా ఎన వేరినం।
మిచ్ఛాపణిహితం చిత్తం, పాపియో నం తతో కరే॥

తా॥ శత్రువు శత్రువుకూ, వైరి వైరికీ చేయు కీడుకన్న చెడు మార్గము ననుసరించు చిత్తము ఎక్కువ కీడు చేయును 42

స్థానము - కోసలజనపదము  వ్యక్తి - సోరెయ్యథేరుడు

శ్లో॥ న తం మాతా పితా కయిరా, అఞ్ఞో వాపిసోచ ఞాతకా।
సమ్మాపణిహితం చిత్తం సెయ్యసో నం తతో కరే॥ 11

తా॥ తలిదండ్రులు, జ్ఞాతి సోదరులు చేయు మేలుకన్న సన్మార్గమున వర్తించు చిత్తము ఎక్కువ మేలు చేయును 43

———

# 4 పుప్ఫవగ్గో చతుత్థో

## పుష్పవర్గము - నాల్గవ అధ్యాయము

స్థానము - శ్రావస్తి　　　　　　　　　　వ్యక్తి - పంచశతభిక్షు

శ్లో|| కో ఇమం పఠవిం విచేస్సతి, యమలోకం చ
　　　　　　　　　　　　　　　　ఇమం సదేవకం
కో ధమ్మపదం సుదేసితం, కుసలో పుప్ఫమివ పచేస్సతి||

తా|| ఎవరీ భూమండలమును మరియు దేవతా సమేతమగు యమ లోకమును జయించగలడు? చతురుడగు వ్యక్తి పూలను మాలగా గ్రుచ్చినట్లు, చక్కగా ఉపదిష్టమైన ధర్మ సూక్తుల నెవరు సంకలనము చేయగలరు? 44

శ్లో|| సేఖో పఠవిం విచేస్సతి, యమలోకం చ ఇమం సదేవకం।
సేఖో ధమ్మపదం సుదేసితం, కుసలో పుప్ఫమివ పచేస్సతి

తా|| శిష్యుడు ఈ భూమండలమును మరియు దేవతా సహితమగు యమలోకమును జయించగలడు నిపుణుడగు మాలాకారుడు పూలను మాలగా గ్రుచ్చినట్లు శిష్యుడు చక్కగా ఉపదేశించబడిన సూక్తులను సంకలనము చేయగలడు 45

స్థానము - శ్రావస్తి          వ్యక్తి - మరీచిని ఉపమించు భిక్షువు

శ్లో॥ ఫేణూపమం కాయమిమం విదిత్వా,
మరీచిధమ్మం అభిసంబుధానో।
ఛేత్వాన మారస్సపపుప్ఫకాని, అదస్సనం మచ్చురాజ
స్సగచ్ఛే॥

తా॥ యీ శరీరము నీటిమీది నురుగువలె క్షణికమైనదని గ్రహించి ఎండమావుల యొక్క వాస్తవికతను తెలుసుకొని మారుని పుష్ప బాణములను విరిచి మృత్యువును జయించవలెను 46

స్థానము - శ్రావస్తి          వ్యక్తి - విడూడభుడు

శ్లో॥ పుప్ఫాని హేవ పచినన్తం, బ్యాసత్తమనసం నరం।
సుత్తం గామం మహోఘోవ మచ్చు ఆదాయ గచ్ఛతి॥

తా॥ ఇంద్రియ సుఖములను పూలను కోయు వానిని, అవ్యవస్థిత మనస్కుని, నిద్రిత గ్రామమును ప్రవాహము ముంచి వేయునట్లు మృత్యువు కబళించును 47

స్థానము - శ్రావస్తి          వ్యక్తి - పతిపూజిక

శ్లో॥ పుప్ఫాని హేవ పచినన్తం, బ్యాసత్తమనసం నరం।
అతిత్తంయేవ కామేసు, అన్తకో కురుతే వసం॥

తా॥ విషయ సుఖములను పూలను కూర్చుకొను వానిని, అవ్యవస్థిత మనస్కుని, కామవాసనలందు తృప్తిలేని వానిని మృత్యువు వశపరచుకొనును, 48

స్థానము - శ్రావస్తి వ్యక్తి - మచ్ఛరియ కోసియ శ్రేష్ఠి

శ్లో॥ యథాపి భమరో పుప్ఫం వణ్ణగంధం అహేఠయం ।
పలేతి రసమాదాయ, ఏవం గామే మునీ చరే॥

తా॥ తుమ్మెద పూలను గాయపరచకుండా దాని రంగు, వాసన మరియు మకరందమును కొనిపోవునట్లు భిక్షువు గ్రామము నందు భిక్షాటనము చేయవలెను 49

స్థానము - శ్రావస్తి వ్యక్తి - పారిక ఆజీవకసాధు

శ్లో॥ న పరేసం విలోమాని, న పరేసం కతాకతం ।
అత్తనో వ అవేక్ఖెయ్య, కతాని అకతానిచ॥

తా॥ ఇతరుల యొక్క లోపములను గాని సాఫల్య వైఫల్యములను గాని చూడక తానేమి చేయుచున్నాడని గమనించాలి । 50

స్థానము - శ్రావస్తి వ్యక్తి - ఛత్రపాణి ఉపాసకుడు

శ్లో॥ యథాపి రుచిరం పుప్ఫం, వణ్ణవంతం అగంధకం ।
ఏవం సుభాసితా వాచా, అఫలాహోతి అకుబ్బతో ॥

తా॥ సుందరమైయుండి, చక్కని రంగు కలిగియు వాసన లేని పుష్పమువలె తాను ఆచరించక పరులకు చెప్పు సూక్తులు నిరర్థకమగును 51

శ్లో॥ యథాపి రుచిరంపుప్పం, వణ్ణవంతం సుగంధకం।
ఎవం సుభాసితా వాచా, సఫలా హోతి సరుబ్బతో॥

తా॥ సుందరమై యుండి చక్కని రంగు మరియు వాసన గల పుష్పమువలె వ్యక్తి తాను ఆచరించుచూ పరులకు చెప్పు సూక్తులు సార్థకమగును 52

స్థానము - పూర్వారామము(శ్రావస్తి) వ్యక్తి - విశాఖఉపాసిక

శ్లో॥ యథాపి పుప్ఫరాసిమ్హా కయిరా మాలా గుణో బహూ।

తా॥ పుష్పరాశి నుండి అనేక మాలలు కూర్చబడినట్లు లోకమున జన్మించిన మర్త్యుడు అనేక సత్కార్మలను చేయవలెను 53

స్థానము - శ్రావస్తి వ్యక్తి ఆనంద థేరుడు

శ్లో॥ న పుప్ఫగంధో పటివాతమేతి, న చందనం తగరం మల్లికావా।
సతంచగంధో పటివాతమేతి,సబ్బాదిసా సప్పురిసో పవాతి॥

తా॥ పూల వాసనగాని, చందన, తగర, మల్లికాదుల వాసనగాని వాయువుకు వ్యతిరేక దిశలో పయనింపజాలదు కాని సజ్జనుల కీర్తిరూపమైన సువాసన గాలికి వ్యతిరేక దిశలో కూడా పయనించును సత్పురుషులు అన్ని దిక్కులకు వ్యాపింతురు 54

శ్లో॥ చందనం తగరం వాపి, ఉప్పలం అథవస్సికీ।
ఎతేసం గంధజాతానం, సీలగంధో అనుత్తరో॥

తా॥ చందన, తగరములనుండిగాని, కమలము, మల్లె పుష్పముల నుండి గాని వెలువడు సువాసనకన్న శీలగంధమే శ్రేష్ఠమైనది 55

శ్లో॥ అప్పమత్తో అయంగంధో, యాయం తగర చందనీ ।
యోచ సీలవతం గంధో, వాతి దేవేసు ఉత్తమో॥

తా॥ తగర చందనాదుల గంధము అల్పమైనది కాని, శీలవంతుల కీర్తిగంధము దేవలోక పర్యంతము వ్యాపింపజాలి నట్టిది 56

స్థానము - రాజగృహము (వేణువనము) వ్యక్తి గోధికథేరుడు

శ్లో॥ తేస సంపన్నసీలానం, అప్పమాద విహారినం ।
సమ్మదఞ్ఞావిముత్తానం, మారో మగ్గం న విన్దతి ।

తా॥ శీల సంపన్నులు, అప్రమత్తులునై విహరించువారిని, సమ్యక్ జ్ఞానము వలన ముక్తులైన వారిని మారుడు వెంబడింపడు

స్థానము - జేతవనము వ్యక్తి గర్హదిన్నుడు

శ్లో॥ యథ సంకారధానస్మిం, ఉజ్ఝితస్మిం మహాపథే ।
పదుమం తత్థ జాయేథ, సుచిగంధం మనోరమం ॥
ఎవ సంకారభూతేసు, అంధభూతే పుథుజ్జనే ।
అతిరోచతి పఞ్ఞాయ సంబాసంబుద్ధ సావకో ॥ 15

తా॥ రాజమార్గము ప్రక్కనగల మురికి గుంటలో పవిత్ర వాసనగల సుందర కమలము మొలకెత్తునట్లు మురికితో సమాన మగు క్షుద్ర అంధకారములో పడి ఉన్న అజ్ఞాన జనుల మధ్య సమ్యక్సంబుద్ధుని శిష్యుడు ప్రజ్ఞా సహాయముతో శోభించును 58,59,

# బాలవగ్గో పంచమో

## బాలవర్గము పంచమాధ్యాయము

స్థానము - జేతవనము (శ్రావస్తి) వ్యక్తి దుర్గతి సేవకుడు

శ్లో॥ దీఘా జాగరతో రత్తి, దీఘం సన్తస్స యోజనం ।
దీఘో బాలానం సంసారో, సద్ధమ్మం అవిజానతం ॥

తా॥ మెలకువగా ఉండువానికి రాత్రి దీర్ఘమైయుండును అలసిన వానికి యోజనమే బహు దూరమనిపించును సద్ధర్మము తెలియని వానికి సంసారయాత్ర దీర్ఘమై తోచును 60

స్థానము రాజగృహము వ్యక్తి శ్రద్ధా విహారిక

శ్లో॥ చరంచే నాధిగచ్ఛేయ్య, సెయ్యం సదిసమత్తనో ।
ఏకచరియం దళ్హం కయిరా, నాత్థి బాలే సహాయతా ॥

తా॥ ఎవరైనా యాత్రికుడు తన సమానుడైన సహచరుడు తోడు దొరకనిచో ఒంటరిగా పయనించుటే ఉత్తమము మూర్ఖుల సహవాసము మంచిది కాదు 61

స్థానము శ్రావస్తి వ్యక్తి ఆనంద శ్రేష్ఠి

శ్లో॥ పుత్తా మత్థి ధనం మత్థి, ఇతి బాలో విహఞ్ఞతి ।
అత్తాహి అత్తనో నత్థి, కుతో పుత్తా కుతో ధనం॥

# 3. చిత్తవగ్గో తతియో

## చిత్తవర్గము మూడవ అధ్యాయము

స్థానము చాలియ పర్వతము          వ్యక్తి మేఘియ థేరుడు

శ్లో॥ ఫందనం చపలం చిత్తం, దురక్ఖం దున్నివారయం ।
ఉజుం కరోతి మేధావీ, ఉసుకారోవ తేజనం ॥

తా॥ విషయ సుఖములవైపు పరుగెత్తునదియు, చంచలమైనదియు, దురక్ష్యము దుర్నివారమునైన చిత్తమును, బాణములు తయారు చేయువాడు అమ్మును వాడిగా చేయునట్లు, మేధావి ఏకాగ్ర మొనరించును 33

శ్లో॥ వారిజోవ థలే ఖిత్తో ఓకమోకత ఉబ్భతో ।
పరిఫందదితం చిత్తం, మారధేయ్యం పహాతవే ॥

తా॥ నీటి నుండి తీసి గట్టున వేయబడిన చేపవలె యీ చిత్తమును మారుని బంధనముల నుండి తప్పించి నచో పరితపించును 34

స్థానము శ్రావస్తి          వ్యక్తి అజ్ఞతర భిక్షు

శ్లో॥ దున్నిగ్గహస్స లహునో, యత్థకామనిపాతినో ।
చిత్తస్స దమథో సాధు, చిత్తం దన్తం సుఖావహం॥

తా॥ నిగ్రహింప కఠినమైనది, క్షుద్రమైనది, ఇష్టాను సారము పరుగెత్తునదియగు చిత్తమును అణచివేయుటే ఉత్తమము అణగిఉన్న చిత్తము సుఖము నిచ్చును 35

స్థానము శ్రావస్తి వ్యక్తి ఉత్కంఠితజ్ఞతర భిక్షు

శ్లో॥ సుదుద్దసం సునిపుణం, యత్థకామనిపాతినం।
చిత్తం రక్ఖేత మేధావీ, చిత్తం గుత్తం సుఖావహం॥

తా॥ మన పరిశీలన నుండి తప్పించుకొనునది, మహాచతుర మైనది, ఇష్టానుసారము పరుగెత్తునదియగు చిత్తమును బుద్ధి మంతుడు రక్షింపు కొనవలెను సురక్షిత చిత్తము వలన సుఖము కల్గును 36

స్థానము శ్రావస్తి వ్యక్తి సంఘరక్షిత థేరుడు

శ్లో॥ దూరంగమం ఏకచరం, అసరీరం గుహాసయం।
యో చిత్తం సంయమేస్సంతి, మోక్ఖంతి మారబంధనా॥

తా॥ ఒంటరిగా బహుదూరము పయనించువాడు, అశరీరియై బుద్ధియందు దాగియున్న చిత్తమును నిగ్రహించినచో మారుని బంధనముల నుండి ముక్తుడు కాగలడు 37

స్థానము - శ్రావస్తి వ్యక్తి చిత్రహస్తి థేరుడు

శ్లో॥ అనవట్ఠితచిత్తస్స, సద్ధమ్మఅవిజానతో।
పరిప్లవపసాదస్స పఞ్ఞా న పరిపూరతి॥

తా॥ సదా ధ్యానరతులగువారు నిత్యము దృఢపరాక్రమముతో యత్నించు వారునగు ధీరులు నిత్యమంగళ స్వరూపమగు నిర్వాణమును పొందుదురు 23

స్థానము రాజగృహము (వేణువనం) వ్యక్తి కుంభఘోషకుడు

శ్లో॥ ఉట్ఠానవతో సతిమతో, సుచికమ్మస్స నిసమ్మకారినో ।
సంయతస్సచ ధమ్మజీవినో, అప్పమత్తస్స యసోభివడ్ఢతి

తా॥ ఆత్మోన్నతికై ప్రయత్నించువారు, స్మృతిమంతులు పెద్దల ద్వారా విని మంచిపనులు చేసేవారు, సంయమపరులు ధర్మజీవనం గడిపేవారు అప్రమత్తులు అగు వారి కీర్తి వృద్ధి పొందును 24

వేణువనము (రాజగృహము) వ్యక్తి చుల్లపంథకథేరుడు

శ్లో॥ ఉట్ఠానేనప్పమాదేన, సంయమేన దమేనచ।
దీపం కయిరాథ మేధావీ, యం ఓఘో నాభికీరతి ॥

తా॥ ఆత్మోన్నతికై ప్రయత్నం చేస్తూ, అప్రమత్తులై, సంయమవంతులై, ఇంద్రియములను నిగ్రహించి, బుద్ధిమంతులు తమను వరద నీరు ముంపకాలని ద్వీపమువలె మార్చుకొందురు 25

శ్లో॥ పమాదమనుయుఞ్జన్తి, బాలా దుమ్మేధినో జనా ।
అప్పమాదం చ మేధావీ, ధనం సెట్ఠం చ రక్ఖతి॥

తా॥ అవివేకులు, దుర్బుద్ధిగలవారు అజాగ్రత్తగా ఉందురు మేధావులు తమ మెలకువను శ్రేష్ఠమైన ధనమువలె కాపాడు కొందురు 26

శ్లో॥ మా పమాద మనుయుఞ్జేథ, మా కామరతిసన్థవం ।
అప్పమత్తో హి ఝాయన్తో, పప్పోతి విపులం సుఖం ॥

తా॥ అజాగ్రత్తగా ఉండకు! కామవాసనలతో పరిచయం పెంచుకోకు! అప్రమత్తుడు ధ్యానశీలుడై విపుల సుఖానుభవమును పొందును 27

స్థానము జేతవనము వ్యక్తి మహాకాశ్యప థేరుడు

శ్లో॥ పమాద అప్పమాదేన, యదా నుదతి పణ్డితో॥
పఞ్ఞాపాసాదమారుయ్హ, అసోకో సోకినం పజం ।
పబ్బతట్ఠో వ భుమ్మట్ఠో, ధీరో బాలే అవేక్ఖతి ॥

తా॥ పండితుడు ప్రయత్నశీలుడై, అజాగ్రత్తను పార ద్రోలి, ప్రజ్ఞా భవనమునధిరోహించి శోకరహితుడగును పర్వతము పైనున్న వాడు నేలపై ఉన్నవారిని చూచునట్లు ఆ ధీరుడు శోక యుక్తులగు అజ్ఞాన ప్రజలను చూచను 28

స్థానము జేతవనము వ్యక్తి ద్వే సహాయక భిక్షువు

శ్లో॥ అప్పమత్తో పమత్తేసు, సుత్తేసు బహుజాగరో ।
అబలస్సం వ సీఘస్సో, హిత్వా యాతి సుమేధసో॥

స్థానము వేణువనము(రాజగృహము) వ్యక్తి చుందసుకోరిక

శ్లో॥ ఇధ సోచతి పేచ్చ సోచతి, పాపకారీ ఉభయత్థ సోచతి,
సోసోచతి సో విహఞ్ఞతి, దిస్వా కమ్మకిలిట్ఠమత్తనో॥

తా॥ చెడు పనులు చేయువారు యీ లోకంలో దుఃఖితురు పరలోకంలో దుఃఖింతురు రెండు లోకములందును దుఃఖింతురు వారు తమ కర్మల యొక్క దౌష్ట్యమును చూసి దుఃఖితులగుదురు నశింతురు 15

స్థానము జేతవనము వ్యక్తి ధర్మిక ఉపాసకుడు

శ్లో॥ ఇధమోదతి పేచ్చమోదతి కతపుఞ్ఞో ఉభయత్థ మోదతి।
సోమోదతి సోపమోదతి, దిస్వాకమ్మ విసుద్ధిమత్తనో॥

తా॥ పుణ్యకర్మలు చేయువారు యీ లోకంలో ప్రసన్నముగా ఉందురు పరలోకంలో ప్రసన్నముగా ఉందురు రెండు లోకములందును ప్రసన్నముగా ఉందురు వారు తమ పవిత్ర కర్మలను చూసి ప్రసన్నముగా ఉందురు సుఖింతురు 16

స్థానము జేతవనము వ్యక్తి దేవదత్తుడు

శ్లో॥ ఇధ తప్పతి పేచ్చ తప్పతి, పాపకారీ ఉభయత్థ తప్పతి।
పాపం మే కతంతి తప్పతి, భియ్యోతప్పతి దుగ్గతింగతో॥

తా॥ పాపకర్మలు చేయువారు యీ లోకములో దుఃఖింతురు పరలోకములో దుఃఖింతురు రెండు లోకములందును దుఃఖింతురు

"నేను పాపము చేసితి"నని తలంచి దుఃఖింతురు దుర్గతిని పొందిన వారు ఎక్కువగా దుఃఖింతురు

స్థానము జేతవనము వ్యక్తి సుమనాదేవి

శ్లో॥ ఇధ నన్దతిపేచ్చ నన్దతి, కత పుఞ్ఞో ఉభయత్థ నన్దతి।
పుఞ్ఞం మే కతంతి నన్దతి భియ్యోనన్దతి సుగ్గతింగతో॥

తా॥ పుణ్యకర్మలు చేయువారు యీ లోకములో ఆనందింతురు పరలోకములో ఆనందింతురు "నేను పుణ్యము చేసితిన'ని తలంచి ఆనందింతురు సుగతిని పొందిన వారు ఎక్కువగా ఆనందింతురు 18

స్థానము జేతవనము వ్యక్తి ద్వేసహాయక భిక్షువు

శ్లో॥ బహుం పి చే సహితం భాసమానో,న తక్కరో హోతినరో పమత్తో
గోపో వ గావో గణయం పరేసం,న భాగవా సామఞ్ఞస్స హోతి ॥

తా॥ శాస్త్రముల గురించి విస్తారముగా మాట్లాడుచూ వాటిని ఆచరింపని ప్రమత్తుడు, ఇతరుల ఆవులను లెక్కించు గొల్లని వంటివాడు వాడు శ్రమణుడగుటకు అయోగ్యుడు 19

శ్లో॥ అప్పం పి చే సహితం భాసమానో, ధమ్మస్స హోతి
అనుధమ్మచారి।

తా॥ నా పుత్రుడు, నా ధనమని యోచించి మూర్ఖుడు వినాశనమును పొందు చున్నాడు తానే తనవాడు కానప్పుడు ఎవరి కొడుకులు ? ఎవరి ధనము ? 62

స్థానము జేతవనము వ్యక్తి అంగుళీ మాలుడు

శ్లో॥ యో బాలో మఞ్ఞతి బాల్యం, పండితో వాపి తేన సో ।
బాలో చ పండిత మానీ, సవే బాలోతి వుచ్చతి ।

తా॥ తన అజ్ఞానము నంగీకరించు మూర్ఖుడు ఆకారణముననే పండితుడగుచున్నాడు కాని తన్ను పండితుడని తలంచు మూర్ఖుడే నిజమైగా మూర్ఖుడు 63

స్థానము జేతవనము వ్యక్తి ఉదాయి థేరుడు

శ్లో॥ యావజీవం పి చే బాలో, పండితం పయిరూపాసతి ।
నసో ధమ్మం విజానాతి, దబ్బి సూపరసం యథా ॥

తా॥ మూర్ఖుడు జీవితమంతయు విద్వాంసుని వద్ద గడిపి నప్పటికిని గరిటె పప్పురుచిని గ్రహింప నట్లే ధర్మమును గ్రహింప జాలడు 64

స్థానము జేతవనము వ్యక్తి తింసపావెయ్యక భిక్షు

శ్లో॥ ముహుత్తమపి చే విఞ్ఞూ, పండితం పయిరూపాసతి ।
ఖిప్పం ధమ్మం విజానాతి, జివ్హాసూపరసం యథా ॥

తా॥ విజ్ఞుడు విద్వాంసుని యొద్ద క్షణమాత్రమున్నను నాలుక పప్పురుచిని గ్రహించు నట్లు ధర్మమును గ్రహించును 65

స్థానము రాజగృహము (వేణువనము) వ్యక్తి సుప్రబుద్ధ కుష్ఠి

శ్లో॥ చరన్తి బాలా దుమ్మేధా, అమిత్తనేవ అత్తనా ।
కరోంతా పాపకె కమ్మం, యం హోతి కటుకప్ఫలం ॥

తా॥ దుష్ట బుద్ధియగు మూర్ఖుడు తనకు తానే శత్రువు వలె ప్రవర్తించును ఎందుకనగా అతడాచరించు దుష్కార్యముల ఫలితము అతి చేదుగా నుండును 66

స్థానము జేతవనము వ్యక్తి ఎక కర్షకుడు

శ్లో॥ న తం కమ్మం కతం సాధు, యం కత్వా అను తప్పతి ।
యస్స అస్సుముఖోరోదం, విపాక పటిసేవతి ॥

తా॥ ఏ కర్మను చేయుట వలన మానవుడు దుఃఖితుడగునో, దేని ఫలమును ఏడుస్తూ, కన్నీటితో అనుభవింప వలసి వచ్చునో ఆ కర్మమంచిది కాదు 67

స్థానము వేణువనము వ్యక్తి సుమనుడు

శ్లో॥ తం చ కమ్మం కతం సాధు, యం కత్వా నాను తప్పతి ।
యస్స పతీతో సుమనో, విపాకం పటిసేవతి ॥

తా॥ ఏ కర్మను చేయుట వలన మానవుడు దుఃఖితుడు కాడో, దేని ఫలమును ప్రసన్న చిత్తుడై సంతోషముతో అనుభవించునో ఆ కర్మ మంచిది 68

స్థానము వేళువనము వ్యక్తి ఉత్పల వర్ణ థేరి

శ్లో॥ మధువా మఞ్ఞతి బాలో, యావ పాపం నపచ్చతి ।
యదా చ పచ్చతి పాపం, అథ బాలో దుఃఖం నిగచ్ఛతి ॥

తా॥ చేసిన పాపము ఫలించ నంత వరకు మూర్ఖుడు దానిని అమృతము వలె భావించును కాని ఆ పాప కర్మ ఫలించి నపుడు అతడు దుఃఖమునే పొందును 69

స్థానము రాజగృహము (వేణువనము) వ్యక్తి జంబుక ఆజీవకుడు

శ్లో॥ మాసే మాసే కుసగ్గేన, బాలో భుఞ్జేథ భోజనం ।
న సో సంఖత ధమ్మానం, కలం అగ్ఘతి సోళసిం ॥

తా॥ మూర్ఖుడు ఒక్కొక్క నెల తర్వాత అమిత సంతోషముతో భోజనము చేయవచ్చును, కాని అది ధర్మజ్ఞుల యొక్క ఆనందంలో పదహారవ వంతునకు కూడా సరికాజాలదు 70

స్థానము రాజగృహము(వేణువనము) వ్యక్తి అహి పేతుడు

శ్లో॥ న హి పాపం కతం కమ్మం, సజ్జుఖీరం వ ముచ్చతి ।
దహంతం బాలమన్వేతి, భస్మచ్ఛన్నో వ పావకో ॥

తా॥ చేసిన పాపము అప్పుడే పిదికిన పాలవలె (పెరుగు రూపములో వెంటనే ప్రభావము చూపదు అది బూడిద కప్పిన అగ్నివలె మూర్ఖుని వెంబడించుచూ వానిని కాల్చుచుండును 71

స్థానము - రాజగృహము(వేణువనము) వ్యక్తి - సట్టికూట (ప్రేత)

శ్లో॥ యావదేవ అనత్థాయ, ఞత్తం బాలస్స జాయతి ।
హన్తి బాలస్స సుక్కంసం, ముద్ధమస్స విపాతయం॥

తా॥ పాపకర్మ చేసితినని తెలియుట కూడా మూర్ఖునికి అనర్థదాయకమే అప్పుడది వాని శిరస్సును వంచుచూ ప్రసన్నతను హరించును 72

స్థానము - జేతవనము వ్యక్తి - సుధర్మథేరుడు

శ్లో॥ అసతం భావనమిచ్ఛేయ్య, పురేక్ఖారం చ భిక్ఖుసు ।
ఆవాసేసుచ ఇస్సరియం, పూజం పరకులేసుచ ॥

తా॥ మూర్ఖుడు భిక్షువులలో సన్మానము, మఠములలో పెద్దరికము, ఇతర పరివారములలో పూజయు మొదలగు అసంభావిత విషయములను వాంఛించును 73

శ్లో॥ మమేవ కతమఞ్ఞతు, గిహీపబ్బజితా ఉభో ।
మమేవ అతివసా అస్సు, కిచ్చా కిచ్చేసు కిస్మిచ ।
ఇతి బాలస్స సంకప్పో, ఇచ్ఛామానో చ వడ్ఢతి ॥

తా॥ గృహస్థులు మరియు పరివ్రాజకులు ఇరువురు నన్నే అనుసరించవలెను మంచి చెడు లన్నిటిలో నన్నే సమర్థించవలెను ఇది మూర్ఖుని సంకల్పము ఈ విధముగా వాని కోరికలు నహంకారము వృద్ధి పొందు చుండును 74

స్థానము - జేతవనము వ్యక్తి - వనవాసిక తిష్యథేరుడు

శ్లో॥ అఞ్ఞాహి లాభూపనిసా, అఞ్ఞా నిబ్బాణ గామినీ ।
ఏవమేతం అభిఞ్ఞాయ, భిక్ఖు బుద్ధస్స సావకో॥
సక్కారం నాభినందెయ్య, వివేకమనుబ్రూహయే ॥ 61

తా॥ సంసార సుఖమునిచ్చు మార్గము వేరు, నిర్వాణమునకు గొనిపోవు మార్గము వేరు ఈ విధముగా తెలుసుకొని బుద్ధుని శిష్యుడు సత్కారాదుల మెచ్చుకొనకుండా వివేక వైరాగ్యములను పెంపొందించవలెను 75

# పణ్డిత వగ్గో చట్ఠో

## పండిత వర్గము ఆరవఅధ్యాయము

స్థానము - జేతవనము　　　　　　　　వ్యక్తి రాధ థేరుడు

శ్లో॥ నిధీనం వ పవత్తార, యం పస్సే వజ్జదస్సినం
నిగ్గయ్హవాదిం మేధావిం, తాదిసం పణ్డితం భజే।
తాదిసం భజమానస్స, సెయ్యో హోతి న పాపియో॥

తా॥ దాగ ఉన్న నిధులను చూపించు వానివలె మన దోషములను చూపు వ్యక్తిని వెదకవలెను పొరపాట్లు చేయకుండా నిగ్రహించు వాడును, మేధావియునగు అట్టి పండితునే సేవించవలెను అట్టిసేవ వలన మేలేకాని కీడెన్నటికిని జరగదు　76

స్థానము - జేతవనము　　　　　　వ్యక్తి - అస్సజీపునబ్బసూ

శ్లో॥ ఓవదెయ్యానుసాసెయ్య, అ సబ్భాచ నివారయే।
సతం హి సో పియో హోతి, అసతం హోతి అప్పియో॥

తా॥ ఇతరులకు ఉపదేశించుచూ, వారి పొరపాట్లను సరిదిద్దుచూ అసభ్యతను దూరము చేయువారు సజ్జనులకు ప్రియులు, దుర్జనులకు అప్రియులు కాగలరు,　77

స్థానము - జేతవనము వ్యక్తి - ఛన్నథేరుడు

శ్లో॥ న భజే పాపకే మిత్తే, న భజే పురిసాధమే ।
భజేథ మిత్తే కల్యాణే, భజేథ పురిసుత్తమే ॥

తా॥ దుష్కర్మలు చేయు మిత్రునితో సహవాసము కూడదు నీచులగు వ్యక్తుల సంపర్కములో ఉండకూడదు మంచిని కోరుమిత్రునితో కలసి ఉండవలెను ఉత్తమ వ్యక్తుల సన్నిధానమునే కోరవలెను 78

స్థానము - జేతవనము వ్యక్తి - మహా కప్పినథేరుడు

శ్లో॥ ధమ్మపీతి సుఖంసేతి, విప్పసన్నేన చేతసా ।
అరియప్పవేదితే ధమ్మే, సదారమతి పణ్డితో ॥

తా॥ ధర్మప్రేమికులు ప్రఫుల్లితమగు మనస్సుతో సుఖముగా నిద్రింతురు విద్వాంసులు శ్రేష్ఠులగు వారిచే ప్రచారితమగు ధర్మమునందే ఆనందింతురు 79

స్థానము - జేతవనము వ్యక్తి పండిత శ్రామణేరుడు

శ్లో॥ ఉదకం హి నయన్తి నేత్తికా, ఉసుకార నమయన్తి తేజనం।
దారుం నమయన్తి తచ్ఛకా, అత్తానం దమయన్తి పండితా॥

తా॥ నీటిని కొనిపోవు వాడు కాలువను త్రవ్వును బాణములు చేయువాడు ములికిని వాడిగా చేయును వడ్రంగి కర్రను చక్కగా మలచును పండితుడు తన్నుతాను సరిదేసుకొనును 80

స్థానము - జేతవనము వ్యక్తి లకుంరక భద్దియథేరుడు

శ్లో॥ సేలో యథా ఎక ఘనో, వాతేన న సమీరతి ।
ఎవం నిందా పసంసాసు, న స పింజన్తి పణ్డితా ॥

తా॥ పెద్ద రాతిబండ గాలికి చలింపనట్లు పండితులు నిందా ప్రశంసలకు అతీతులై యుందురు 81

స్థానము - జేతవనము వ్యక్తి - కాణమాతృ

శ్లో॥ యథాపి రహదో గంభీరో, విప్పసన్నో అనావిలో ।
ఎవం ధమ్మాని సుత్వాన, విప్పసీదన్తి పణ్డితా ॥

తా॥ లోతైన చెరువు స్వచ్ఛమై, క్రిమిరహితమై యున్నట్లు పండితులు ధర్మశ్రవణముచే పరిశుద్ధులగుదురు 82

స్థానము - జేతవనము వ్యక్తి - పంచశత భిక్షు

శ్లో॥ సబ్బత్తవే సప్పురిసా చజన్తి న కామ కామా లపయన్తి సన్తో ।
సుఖేన ఫుట్టా అథవా, దుఃఖేన, న ఉచ్చావాచం పండితా దస్సయంతి ॥

తా॥ సజ్జనులు ఎల్ల వేళలను సంతుష్టులై యుందురు లౌకిక వాంఛల గూర్చి ఎక్కువగా మాట్లాడరు సుఖములయందు పొంగరు దుఃఖములలో కృంగరు 83

స్థానము - జేతవనము వ్యక్తి - ధర్మిక థేరుడు

శ్లో॥ న అత్తహేతు న పరస్స హేతు, నపుత్తమిచ్ఛే న ధనం న రట్ఠం ॥
న ఇచ్ఛేయ్య అధమ్మేన సమిద్ధిమత్తనో, ససీలవా పఞ్ఞవా ధమ్మికో సియా ॥

తా॥ తన కొరకు లేక ఇతరుల కొరకు గాని, సంతానమును, ధనమును, రాజ సన్మానమును కోరని వారు, అధర్మముతో తమ సంపదను పెంచుకొనవలెనని తలంచని వారే శీలవంతులు, ప్రజ్ఞావంతులు, ధార్మికులు కూడా 84

స్థానము - జేతవనము వ్యక్తి - ధర్మ శ్రమణుడు

శ్లో॥ అప్పకా తే మనుస్సేసు, యేజనా పారగామినో ।
అథాయం ఇతర పజా, తీరమేవానుధావతి ॥

తా॥ సంసార సాగరమును తరించి నిర్వాణమును పొందు వారు ఏ కొందరో । తక్కిన అనేక ప్రజలు తీరమునందే ఇటునటు పరుగెత్తు మందురు 85

శ్లో॥ యే చ ఖో సమ్మదక్ఖాతే, ధమ్మే ధమ్మానువత్తినో ।
తే జనా పారమేస్సన్తి, మచ్చు ధెయ్యం సుదుత్తరం ॥

తా॥ చక్కగా ఉపదేశింపబడిన ధర్మము ప్రకారము నడచుకొను వారు, దుస్తరమగు మృత్యు క్షేత్రమును తరింతురు 86

స్థానము - జేతవనము  వ్యక్తి - పంచశత ఆగంతుకభిక్షు

శ్లో॥ కణ్హం ధమ్మం విప్పహాయ, సుక్కం భావేథ పండితో ।
ఓకా అనోకం ఆగమ్మ, వివేకే యత్థ దూరమం ।
తత్రాభిరతిమిచ్ఛేయ్య, హిత్వా కామే అకించనో।
పరియోదపెయ్య అత్తానం, చిత్తక్లేసేహి పండితో ॥

తా॥ విద్వాంసులు చెడు మార్గమును వదలి వెలుగు మార్గమును ధ్యానింతురు ఇల్లు వదలి భిక్షువులై, అన్ని విధములగు కోరికలను విడచి, ఏది అనుభవించుట మిక్కిలి కష్టమో అట్టి వైరాగ్యము సంపాదించుదురు వారు తమ చిత్తము నందలి మాలిన్యములను తొలగించుకొందురు 87,88

శ్లో॥యేసం సంబోధి అంగేసు, సమ్మా చిత్తం సుభావితం ।
ఆదానపటినిస్సగ్గో, అనుపాదాయ యే రతా ।
ఖీణాసవా జుతీమంతో, తే లోకే పరినిబ్బుతా॥ 14

తా॥ [1] సంబోధి యొక్క ఏడు అంగములందు ఎవని మేధస్సు ఉద్బోధితమైనదో, ఎవడు అపరిగ్రహమును ఆనందించునో, ఎవని యందు ఆస్రవములు (చిత్తమలములు) క్షీణించినవో, అట్టి దివ్య ప్రకాశ యుతులే ఈ లోకమున సర్వాధిక సుఖ సంపన్నులు 89

---

1 సప్త బోధ్యంగములు 1) స్మృతి 2) ధర్మవిచారము 3) వీర్యము 4) ప్రీతి 5) ప్రశాంతి 6) సమాధి 7) ఉపేక్ష
5)

# అరహన్తవగ్గో సత్తమో

## అర్హాంత వర్గము - ఏడవ అధ్యాయము

స్థానము - జీవకుని మామిడి తోట (రాజగృహం) వ్యక్తి - జీవకుడు

శ్లో॥ గతద్దినో విసోకస్స, విప్పముత్తస్స సబ్బధి ।
సబ్బగన్థప్పహీనస్స పరిలాహో న విజ్జతి ॥

తా॥ సంసార యాత్రను పూర్తి చేసుకొను వారు, శోక రహితులు, అన్ని విధముల ముక్తులును, సర్వ సాంసారిక బంధనములు తొలగిన వారునగు జ్ఞానవులకు దుఃఖములుండవు 90

స్థానము - వేణువనము (రాజగృహము) వ్యక్తి - మహా కాశ్యపుడు

శ్లో॥ ఉయ్యుంజన్తి సతీమన్తో, న నికేతే రమన్తి తే ।
హంసా వ పల్లలం హిత్వా, ఓకమోకం జహన్తి తే॥

తా॥ బుద్ధిమంతుడు నిర్వాణ(ముక్తి) ప్రాప్తికై ప్రయత్నించును అతనికి ఇంటిపై ప్రేమ ఉండదు వర్ష ఋతువులో హంస తన రక్షణకు మరియు ఆహారము కొరకు తన గృహమగు చెరువును వదలునట్లు అట్టివారు తమ ఇంటిని పరిత్యజింతురు 91

స్థానము - జేతవనము వ్యక్తి - వేలట్టి సీస

శ్లో॥ యేసం సంనిచయో నత్థి, యే పరిఞ్ఞాత భోజనా
సుఞ్ఞతో అనిమిత్తోచ, విమోఖ్కో యస్యగోచరో ।
ఆకాసేవ సకుంతానం, పదం తరస దురన్నయం ॥

తా॥ ఎవరి వద్ద రెండు విధముల సంచయములు (కర్మ సంచయము, ప్రత్యయ సంచయము) లేవో, భోజన విషయమున ఎవరు విజ్ఞులో, ఎవరు శూన్యము, నిరపేక్షము అను రెండు విధముల ముక్తులో అట్టివారి జాడ ఆకాశమున ఎగిరిపోయిన పక్షిజాడవలె తెలియుట చాలా కష్టము 92

కర్మ ప్రత్యయ సంచయములు - ఇంకను తాను అనుభవింప వలసిన పురాకృత కర్మను కర్మసంచయము అనగా మిగిలి ఉన్న కర్మ అని, లోకములో మనము కూడబెట్టిన ధన ధాన్యది సంపదను ప్రత్యయ సంచయమని పేర్కొందురు

శూన్యము - సర్వ ధర్మములు, సంస్కారములు నశించిన నిర్వాణ స్థితియే శూన్యావస్థ

నిరపేక్షము - యీ లోకములో దేని పైనను ఆసక్తిలేకుండుటే నిరపేక్షము అనగా ధనధాన్యములు ధారాపుత్రాది బంధనములు లేని వాడగుట,

స్థానము - వేళువనము (రాజగృహము) వ్యక్తి - అనిరుద్ధ థేరుడు

శ్లో॥ యస్సాసవా పరిక్ఖీణా, అహారే చ అనిస్సితో ।
సుఞ్ఞతో అనిమిత్తో చ, విమోక్ఖో యస్స గోచరో ।
అకాసే వ సకుంతానం, పదం తస్స దురన్నయం॥

తా॥ ఎవని చిత్తమునందలి దోషములు క్షీణించినవో, విషయ భోగములందెప్పుడు ఉదాసీనుడో, శూన్యము- నిరపేక్షము నను రెండు విధముల మోక్షములెవనికి కరతలామలకమో అట్టి వాని జాడ ఆకాశమున ఎగిరి పోయిన పక్షిజాడవలె తెలియుట చాలా కఠినము 93

స్థానము - జేతవనము వ్యక్తి - సారిపుత్ర థేరుడు

శ్లో॥ పఠవీసమో నో విరుజ్ఝతి,ఇందఖీలూపమో తాది సుబ్బతో,
రహదో 'వ' అపేత కద్దమో, సంసార నభవన్తి తాదినో॥

తా॥ భూమివలె సహనశీలుర, మందర పర్వతమువలె సర్వావస్థలందు నిశ్చలముగా నుండువారు, క్రిములు లేని చెరువు వలె నిర్మలులైనవారు మరల జన్మింపరు 94

స్థానము - పూర్వారామము వ్యక్తి - మహాకాత్యాయన థేరుడు

శ్లో॥ యస్సింద్రియాని సమథం గతాని, అస్సాయథా
సారథినా సుదన్తా ।
పహీనమానస్స అనాసవస్స, దేవాపి తస్స పిహియన్తి
తాదినో ॥

తా॥ సారథి వలన చక్కగా శిక్షణపొందిన గుర్రములవలె ఎవని ఇంద్రియములు శాంతించినవో, ఎవని గ్రంథులు శిథిలమై చిత్తవృత్తులు నిరోధింప బడినవో అట్టివానిని దేవతలు కూడా స్మరింతురు 95

స్థానము - జేతవనము వ్యక్తి - కౌశాంబి భసిత తిష్య థేరుడు

శ్లో॥ సంతం తస్స మనం హోతి, సన్తా వాచా చ కమ్మ చ ।
సమ్మద ఞ్ఞావిముత్తస్స, ఉపసన్తస్స తాదినో ॥

తా॥ పైన పేర్కొనిన నియమముల ద్వారా సాధన చేసిన వారి యొక్క మనో వాక్కర్మలు సర్వము శాంతించి, సమ్యక్ జ్ఞానమును పొంది ముక్తు లగుదురు 96

స్థానము - జేతవనము వ్యక్తి - సారిపుత్ర థేరుడు

శ్లో॥ అస్సద్ధో అకతఞ్ఞూ చ, సంధిచ్ఛేదో చ యో నరో ।
హతావ కాసోవన్తాసో, సవే ఉత్తమ పోరిసో ॥

తా॥ అశ్రద్ధాపరుడు, అకృతజ్ఞుడు, అంటు తెగగొట్టు వాడు, నిరవకాశుడు నిరాశకుడైన వాడే ఉత్తమ పురుషుడు 97

(యీ శ్లోకార్థమును గమనించిన అది అనీతిని సమర్థించి నట్లు కన్పించును కాని అది నిజము కాదు దీని పారిభాషిక అర్థము ఇట్లున్నది

అశ్రద్ధా పసుడు = అంధ విశ్వాసములు లేనివాడు

అకృతజ్ఞుడు=అనగా ఏమియు చేయకుండుటను తెలసినవాడు నిర్వాణమును పొందిన సమాధి అవస్థలో సర్వ కర్మలు శాంతించినవి కావునా అది అకృతావస్థ

సంధిచ్ఛేదకుడు = సంధి, సంయోజనముల తెగగొట్టువాడు
నిరవకాసుడు = పునర్జన్మకు అవకాశము లేనివాడు
నిరాశకుడు=ఆశాతృష్ణలు నశించిన వాడు

స్థానము - జేతవనము వ్యక్తి ఖాదిరవనియ రేవత థేరుడు

శ్లో॥ గామేవా యదివారఞ్ఞే, నిన్నేవా యదివా థలే ।
యత్థారహన్తో విహరన్తి, తం భూమి రమణెయ్యకం ॥

తా॥ గ్రామము గాని లేక అరణ్యము గాని, ఎత్తైన దిబ్బ గాని లేక నేల గాని ఎక్కడ అర్హతులు విహరింతురో ఆ భూమి రమణీయమైనది 98

స్థానము జేతవనము వ్యక్తి అరణ్యక భిక్షు

శ్లో॥ రమణీయాని అరఞ్ఞాని । యత్థ న రమతే జనో ।
వీతరాగా రమిస్సన్తి । న తే కామ గవేసినో ॥ 10

తా॥ ఏ అరణ్యములలో సామాన్య ప్రజలానందించరో, అచ్చట కామ సుఖముల నన్వేషింపని విరాగులు ఆనందింతురు అట్టి అరణ్యములే రమణీయమైనవి 99

# సహస్సవగ్గో అట్ఠమో

## సహస్ర వర్గము   ఎనిమిదవ అధ్యాయము

స్థానము - వేణువనము   వ్యక్తి - తంబదారికచోర ఘాతకుడు

శ్లో॥ సహస్సమపి చే వాచా, అనత్థపద సంహితా।
ఏకం అత్థ పదం సెయ్యో, యం సుత్వాఉపసమ్మతి॥

తా॥ నిరర్థకములగు వేలకొలది మాటల కన్న శాంతి నిచ్చు ఒక్క మాటయే శ్రేష్టమైనది 100

స్థానము వేణువనము   వ్యక్తి దారుచీరియథేరుడు

శ్లో॥ సహస్సమపి చే గాథా, అనత్థ పద సంహితా।
ఏకం ధమ్మపదంసెయ్యో, యం సుత్వా ఉపసమ్మతి॥

తా॥ వ్యర్థమగు మాటలతో కూడిన వేలకొలది గాథల కన్న మనస్సుకు శాంతిని కల్గించు ధర్మవాక్యమొక్కటే మేలైనది 101

స్థానము జేతవనము   వ్యక్తి కుండలి కేసీథేరుడు

శ్లో॥ యోచ గాథాసతం భాయే, అనత్థ పదసంహితా।
ఏకం ధమ్మపదం సెయ్యో, యం సుత్వా ఉపసమ్మతి॥

తా॥ నిరర్థక పదములతో కూడిన వందల కొలది గాథల కన్న శాంతినిచ్చు ధర్మవాక్యమొక్కటే మేలైనది 102

శ్లో॥ యో సహస్సం సహస్సేన, సంగామే మనుసే జినే।
ఏకం చ జెయ్యమత్తానం, సవే సంగామజుత్తమో ॥

తా॥ యుద్ధములో ఒంటరిగా లక్షల కొలది మనుష్యులను జయించిన వానికన్న తన్నుతాను జయించినవాడు ఉత్తముడు యుద్ధవీరులలో వాడే శ్రేష్ఠుడు 103

స్థానము జేతవనము వ్యక్తి అనత్తపుచ్ఛక బ్రాహ్మణుడు

శ్లో॥ అత్తా హవే జితం సెయ్యో, యా చాయం ఇతర పజా।
అత్తదన్తస్స పోసస్స, నిచ్చం సంయతచారినో॥
నేవదేవో న గంధబ్బో, న మారో సహ బ్రిహ్మునా।
జితం అపజితం కయిరా, తథా రూపస్సజంతునో ॥

తా॥ ఇతరులను జయించుట కన్న తన్నుతాను జయించుటే శ్రేష్ఠము ఆత్మ నిగ్రహము కలిగి, నిత్యసంయుతుడైనట్టి అట్టి పురుషుని దేవగంధర్వులు గాని బ్రహ్మసహితుడగు మారుడు గాని పరాజితుని చేయజాలరు 104, 105

స్థానము - వేణువనము వ్యక్తి - సారిపుత్రథేరుని మాత

శ్లో॥ మాసే మాసే సహస్సేన, యో యజేథ సతం సమం।
ఏకం చ భావితత్తానం, ముహుత్తమపి పూజయే ॥

సాఎవ పూజనా సెయ్యో, యం చే వస్స సతంహుతం॥

తా॥ వేలకొలది ధనము వెచ్చించి నూరు సంవత్సరముల పర్యంతము చేయు యజ్ఞము కన్న ఆత్మనిగ్రహము కల్గిన వ్యక్తికి చేయు క్షణమాత్ర పూజయే శ్రేష్ఠమైనది 106

స్థానము - వేణువనము వ్యక్తి - సారిపుత్ర భాగినెయ్య

శ్లో॥ యో చ వస్ససతం జంతు, అగ్గిం పరిచరే వనే।
ఎకం చ భావితత్తానం, ముహుత్తమపి పూజయే।
సా ఎవ పూజనా సెయ్యో, యం చేవస్ససతం హుతం॥

తా॥ నూరు సంవత్సరముల వరకు చేయు అగ్ని పరిచర్య కన్న ఆత్మ నిగ్రహ పరుడగు వ్యక్తికి చేయు క్షణమాత్ర పూజయే శ్రేష్టమైనది 107

స్థానము - వేణువనము వ్యక్తి - సారిపుత్రమిత్ర బ్రాహ్మణుడు

శ్లో॥ యం కించి యిట్ఠం హుతం లోకే,
సంవచ్ఛరం యజేథ పుఞ్ఞపేఖో।
సబ్బం పి తం న చతుభాగమేతి।
అభివాదనా ఉజ్జుగతేసు సెయ్యో॥

తా॥ పుణ్యమును కోరి మానవులు సంవత్సర కాలము చేయు యజ్ఞము వలన వచ్చు పుణ్యమంతయు మంచి స్వభావము

గృహవాసికి నమస్కరించుట వలన వచ్చు పుణ్యములో నాలుగవ భాగము మాత్రమే 108

స్థానము - అరణ్యకుటీరము   వ్యక్తి - దీర్ఘాయు కుమారుడు

శ్లో॥ అభివాదన శీలస్స; నిచ్చం వద్ధాపచాయినో।
చత్తారో ధమ్మా వద్ధంతి, ఆయువణ్ణో సుఖం బలం॥

తా॥ అభివాదనశీలురు, సదా, విద్వజ్జనుల సేవతో నిమగ్నులగు వారియొక్క నాలుగు ధర్మములు ఆయువు, వర్ణము, సుఖము మరియు బలము పెంపొందును 109

స్థానము - జెతవనము   వ్యక్తి - సంకిచ్చ శ్రామణేరుడు

శ్లో॥ యో చ వస్ససతం జీవే, దుస్సీలో అసమాహితో।
ఏకాహం జీవితం సెయ్యో, సీలవంతస్స ఝాయినో॥

తా॥ దుశ్శీలుడు, ఇంద్రియ నిగ్రహము లేనివాడునగు వ్యక్తి యొక్క నూరేండ్ల జీవితము కన్న, శీలవంతుడు, ధ్యానపరుడునగువాని ఒక్క రోజు జీవితమే శ్రేష్ఠము 110

స్థానము - జేతవనము   వ్యక్తి - కొండిన్యథేరుడు

శ్లో॥ యో చ వస్ససతం జీవే, దుప్పఞ్ఞో అసమాహితో।
ఏకాహం జీవితం సెయ్యో, పఞ్ఞావంతస్స ఝాయినో॥

తా॥ దుర్బుద్ధి గలవాడు, ఇంద్రియ నిగ్రహము లేనివాడు నగు వ్యక్తి యొక్క నూరేండ్ల జీవితము కన్న ప్రజ్ఞావంతుడును ధ్యానశీలుడునగు వ్యక్తి యొక్క ఒక్కరోజు జీవితమే శ్రేష్ఠము 111

స్థానము - జేతవనము వ్యక్తి - సప్పదాసథేరుడు

శ్లో॥ యో చ వస్ససతంజీవే కుసీతో హీనవీరియో ।
ఏకాహం జీవితం సెయ్యో, వీరియమారభతో దళ్హం ॥

తా॥ సోమరి మరియు వీర్యహీనుడునగు వ్యక్తి యొక్క నూరేండ్ల జీవితము కన్న దృఢపూర్వకముగా పరాక్రమించు వాని ఒక్కరోజు జీవితమే శ్రేష్ఠము 112

స్థానము - జేతవనము వ్యక్తి - పటాచారథేరి

శ్లో॥ యో చ వస్ససతం జీవే, అపస్సం ఉదయ వ్యయం ।
ఏకాహం జీవితం సెయ్యో, పస్సతో ఉదయవ్యయం ॥

తా॥ పంచ స్కంధముల యొక్క ఉత్పత్తి-వినాశముల తెలియని వాని నూరేండ్ల జీవితము కన్న ఆ స్కంధముల ఉత్పత్తి-నాశనముల తెలిసినవాని ఒక్క రోజు జీవితమే శ్రేష్ఠము 113

పంచ స్కంధములు:- 1) రూపము 2) వేదన 3) సంజ్ఞ 4) సంస్కారము 5) విజ్ఞానము.

రూపము యీ లోకమును తెలిసికొనుటకు జ్ఞానేంద్రియ ములైన చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు సాధనములు యీ జ్ఞానేంద్రియ విషయములైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములైదును రూపభేదములనబడును కంటితో ఒకరూపమును దర్శించు చున్నాము అది రూపరూపము చెవితో శబ్దమును గ్రహించు చున్నాము అదిశబ్ద రూపము చర్మముతో స్పర్శను గ్రహించు చున్నాము అది స్పర్శ రూపము అట్లే నాలుక గ్రహించునది రస (రుచి) రూపమనియు ముక్కు గ్రహించునది గంధరూపమనియు పిలువబడును

వేదన - కంటితో ఒక రూపమును దర్శించినపుడు సుఖానుభూతి గాని, లేదా దుఃఖానుభూతిగాని లేక అసుఖ, అదుః ఖానుభూతి గాని కలుగవచ్చును ఇట్లు జ్ఞానేంద్రియ విషయముల ద్వారా లోకమును స్పర్శించినప్పుడు చిత్తములో కలుగు అనుభూతి నేవేదన అని పేర్కొందురు

సంజ్ఞ - చెవి ద్వారా చక్కని సంగీతము విన్నప్పుడు ఆ ఎరుక మనలో నిలిచి పోవును దానిని శబ్దసంజ్ఞ అందురు అట్లే చర్మము ద్వారా గ్రహింపబడు స్పర్శ సంజ్ఞ, కన్ను ద్వారా గ్రహింపబడు రూపసంజ్ఞ, నాలుక ద్వారా గ్రహింపబడు రస సంజ్ఞ, ముక్కు ద్వారా గ్రహింపబడు గంధ సంజ్ఞ ఇంద్రియ విషయముల ద్వారా ఆయా వాటిని తెలిసికొనినప్పుడు వాటికి

సంబంధించిన ఎరుక మనలో ముద్రింప బడుచున్నది దానినే సంజ్ఞ అని అందురు

సంస్కారము - ఇంద్రియముల ద్వారా ఒకానొక అనుభూతిని మనము పొందినప్పుడు దానికి సంబంధించిన ఎరుక మనలో నిలిచి ఉండుటే గాక అది వృత్తి రూపమును ధరించును వీటినే సంస్కారములందురు

విజ్ఞానము - దేహధారియైన పుద్గలుడు (జీవుడు) ఆయా ఇంద్రియ వేదనం వల్ల సుఖ దుఃఖానుభవములను పొందును ఆయా వేదనలు అతని మనస్సుపై కల్గించిన ప్రతిక్రియ వలన ఒకని వ్యక్తిత్వము రూపు దిద్దుకొనును ఆయా సంవేదనలను, సంఘటనలను విశ్లేషించుకోవటంలో అతని గతజన్మ సంస్కారాలు అతనిదైన ఒక దృష్టిని ఏర్పరుస్తాయని కూడా మరువరాదు అంటే యీ వ్యక్తిత్వము ఇప్పుడే రూపొందటం ప్రారంభం కాలేదని ఇదే ముగింపుకాదనీ తేలుతుంది ఇది నిరంతరం పరిణామం చెందే తత్వం ఇది ఎప్పుడు ప్రారంభమైందీ అన్న ప్రశ్నను బుద్ధుడు "అవ్యాకృత మంటాడు' అంటే వివరింప గూడనిది అని

నిత్యము, అవినాశము, అయిన ఆత్మ మార్పులేనిదని అది మానవుడు వస్త్రాల్ని ధరించినట్లుగా యీ దేహాన్ని ధరిస్తుందని వేదాంతము చెప్తుంటె, ఏదైతే యీ శరీరాల్ని ధరిస్తుందో అది

మార్పు చెందుతుందని బుద్ధుని ఉవాచ ఉదా - పాలు పెరుగు గా మారుతున్నాయి పెరుగు వెన్నగా వెన్న నెయ్యిగా మారు తున్నాయి ఒక్కటే ఇన్ని విధాలుగా మారుతున్నప్పటికి ఒకటి ఉన్నప్పుడు మరొకటి లేదు ' పాలు, పెరుగుగా మారిన తర్వాత పెరుగే ఉంది పాలులేవు అట్లాగే గతజన్మలో ఉన్నతాను ఎంతో మార్పుచెంది యీ దశకు వచ్చాడు ' ఇప్పుడున్న యీ పరిణిత ధశలో తాను గతజన్మలో ఉన్నట్టుగా మార్పు లేకుండా అలాగే ఉన్నానని చెప్పరాలము యీ ధకంగా ఆయా శరీరాల్ని ధరిస్తూ అతని కర్మలన్ను బట్టి ఎరిణితివైపుకో లేక పతన్నం వైపుకో అల్లా మార్పుల్లు చెందుతూపోయే యీ తత్త్వమే విజ్ఞానము.

స్థానము - జేతవనము    వ్యక్తి - కృశగౌతమి

శ్లో॥ యో చ వస్ససతం జీవే, అపస్స అమతం పదం।
ఏకాహం జీవితం సెయ్యో, పస్సతో అమతం పదం॥

తా॥ అమృత పదవియగు నిర్వాణమును (ముక్తి) తెలియని వాని నూరేండ్ల జీవితము కన్న, నిర్వాణమును తెలిసిన వాని ఒక్క రోజు జీవితమే శ్రేష్ఠమైనది 114

స్థానము - జేతవనము వ్యక్తి - బహుపుత్రికథేరి

శ్లో॥ యో చ వస్ససతం జీవే, అపస్సం ధమ్మ ముత్తమం ।
ఎకాహం జీవితం సెయ్యో, పస్సతో ధమ్మ ముత్తమం ॥16

తా॥ ఉత్తమ ధర్మము నెరుంగని వ్యక్తి యొక్క నూరేండ్ల జీవితము కన్న, ఉత్తమ ధర్మమును తెలిసినవాని ఒక్కరోజు జీవితమే శ్రేష్టము 115

———

# పాపవగ్గో నవమో

## పాపవర్గము - తొమ్మిదవ అధ్యాయము

స్థానము - జేతవనము వ్యక్తి - చులేక సాటక బ్రాహ్మణుడు

శ్లో॥ అభిత్థరేథ కల్యాణో, పాపాచిత్తం నివారయే।
దంధం హి కరోంతో పుఞ్ఞం, పాపస్మిం రమతోమనో॥

తా॥ శుభ కర్మలను శీఘ్రమే చేయవలెను పాపకర్మలు చేయకుండా, చిత్తమును నిగ్రహించవలెను పుణ్య కర్మలు చేయటంలో ఆలసించినచో మనస్సు పాపము నందానందించును

స్థానము - జేతవనము వ్యక్తి - సెయ్యాసక థేరుడు

శ్లో॥ పాపం చే పురిసా కయిరా, న తం కయిరా పునప్పునం।
న తమ్హి ఛందం కయిరాథ, దుక్ఖో పాపస్స ఉచ్చయో॥

తా॥ ఒకవేళ పొరపాటున పాపకర్మ చేసినచో దానిని మరల మరల చేయకూడదు ఆ పాప కర్మను వాంఛించ కూడదు ఎందుకనగా పాప సంచయమే దుఃఖము

స్థానము - జేతవనము వ్యక్తి - లాజదేవుని కన్య

శ్లో॥ పుఞ్ఞం చే పురిసో కయిరా, కయిరాథేతం పునప్పునం।
తమ్హి ఛందం కయిరాథ, సుఖో పుఞ్ఞస్స ఉచ్చయో॥

తా॥ పుణ్య కర్మ చేసినవాడు దానిని మరల మరల చేయవలెను ఆ పుణ్య కర్మనే వాంఛింపవలెను ఎందుకనగా పుణ్య సముచ్చయమే సుఖము 118

స్థానము - జేతవనము వ్యక్తి - అనాథపిండక శ్రేష్ఠి

పాపోపి పస్సతి భద్రం, యావ పాపం న పచ్చతి।
యథా చ పచ్చతి పాపం, అథపాపో పాపాని పస్సతి॥

తా॥ పాపకర్మ ఫలించనంతవరకు పాపికి కూడా శుభమే కన్పించును పాపము ఫలించి నప్పుడు పాపికి తన పాపములు గోచరించును 119

శ్లో॥ భద్రోపి పస్సతి పాపం, యావభద్రం న పచ్చతి।
యథా చ పచ్చతి భద్రం, అథ భద్రోభద్రాని పస్సతి॥

తా॥ శుభ కర్మ ఫలించనంతవరకు మంచివాడు కూడా పాపకర్మల వైపు చూచును కాని శుభ కర్మ ఫలించినపుడు అతడు మంచి కర్మలవైపే దృష్టిని మళ్ళించును 120

స్థానము - జేతవనము  వ్యక్తి - అసఙ్చత పరిష్కార భిక్షువు

శ్లో॥ మాప్పమఞ్ఞేథ పాపస్స, నమన్తం ఆగమిస్సతి ।
ఉదబిందునిపాతేన, ఉదకుంభోపి పూరతి ।
పూరతి బాలో పాపస్స, థోకథోకంపి ఆచినం ॥

తా॥ పాపము నన్ను చేరదని హేళనగా మాటాడకూడదు ఒక్కొక్క నీటి బొట్టుపడి నీటికుండ నిండునట్లుగా, మూర్ఖుడు క్రమముగా తన పాపసంచయమును పెంచుకొనును  121

స్థానము - జేతవనము  వ్యక్తి - బిలాలపాద శ్రేష్ఠి

శ్లో॥ మాప్పమఞ్ఞేథ పుఞ్ఞస్స, నమంతం ఆగమిస్సతి ।
ఉదబిందు ని పాతేన, ఉదకుంభోపి పూరతి ।
ధీరో పూరతి పుఞ్ఞస్స థోక థోకం పి ఆచినం॥

తా॥ పుణ్యము నన్ను చేరదని హేళనగా మాట్లాడకూడదు ఒక్కొక్క నీటి బిందువు పడి నీటి కుండ నిండునట్లు కొద్దికొద్దిగా పుణ్యము చేయుచూ ధీరుడు పుణ్య సంచయమును పెంచుకొనును

స్థానము - జేతవనము  వ్యక్తి - మహాధన వణిజుడు

శ్లో॥ వాణిజో వ భయం మగ్గ అప్పసత్థో మహద్ధనో ।
విసం జీవితు కామోవ పాపాని పరివజ్జతే ॥

తా॥ కొద్ది పరివారము గల మహాధనవంతుడగు వ్యాపారి, దొంగలు, క్రూరమృగములతో కూడి భయమును కల్గించు మార్గ

మును వదలి పెట్టునట్లు, జీవింప గోరు వాడు పాపములను పరిత్యజింప వలెను 123

స్థానము - వేణువనము వ్యక్తి - కుక్కుట మిత్రుడు(నిషాదుడు)

శ్లో॥ పాణిమ్హిచే వణో నాస్స, హరేయ్య పాణినా విసం ।
నాబ్బణం విసమన్వేతి, నాత్థి పాపం అకుబ్బతో॥

తా॥ గాయము లేని చేతితో విషమును తాకినను ప్రమాదము ఉండదు అట్లే చేయని వానిపై పాప ప్రభావము ఉండదు

స్థానము - జేతవనము వ్యక్తి - శునకలుద్ధకుడు

శ్లో॥ యో అప్పదుట్ఠస్స నరస్స దుస్సతి,
సుద్ధస్స పోసస్స అనఙ్గణస్స ।
తమేవ బాలం పటియే పాపం,
సుఖుమో రజో పటివాతం వ ఖిత్తో॥

తా॥ దోషరహితుడు, పరిశుద్ధుడు, నిర్లిప్తుడునగు పురుషునికి దోషము నాపాదించు మూర్ఖుని, ఎదురుగాలికి పడవేసిన దుమ్ము వేసిన వానిపైనే పడునట్లు పాపము వెంబడించును 125

స్థానము - జేతవనము వ్యక్తి మణికార తిష్యథేరుడు

శ్లో॥ గబ్భమేకే ఉప్పజ్జన్తి, నిరయం పాపకమ్మినో ।
సగ్గం సుగతినోయన్తి, పరినిబ్బన్తి అనాసవా ॥

తా॥ యీ లోకమున జన్మించిన వారిలో పాపకర్ములగు వారు నరకమునకు పోదురు సన్మార్గమున నడచు వారు స్వర్గమునకు పోవుదురు వాసనావిముక్తులగు శూన్యచిత్తులు నిర్వాణమును పొందుదురు

స్థానము - జేతవనము వ్యక్తి త్రిభిక్షువులు

శ్లో॥ న అన్తలిక్ఖే న సముద్దమజ్ఝే,
న పబ్బతానం వివరం పవిస్స ।
న విజ్జతి సో జగతిప్పదేసో,
యత్థట్ఠితో ముచ్చెయ్య పాపకమ్మా ॥

తా॥ అంతరిక్షమున గాని, సముద్ర మధ్యమునగాని, పర్వత గుహలయందు గాని ఎక్కడ దాగినను పాపఫలితము నుండి తప్పించుకొను అవకాశము లేదు 127

స్థానము - న్యగ్రోధారామము వ్యక్తి - సుప్రబుద్ధశాక్యుడు

శ్లో॥ న అన్తలిక్ఖే న సముద్ద మజ్ఝే,
న పబ్బతానం వివరం పవిస్స,
న విజ్జతి సో జగతిప్పదేసో,
యత్థట్ఠితం నాప్పసహెయ్యమచ్చు ॥ 13॥

తా॥ అంతరిక్షములో గాని సముద్రమధ్యమునగాని కొండ గుహలలోగాని ఎక్కడ దాగినను మృత్యువు బాధింపని చోటు లేదు 128

# దణ్డవగ్గో దసమో

## దండవర్గము పదియవ అధ్యాయము

స్థానము జేతవనము వ్యక్తి - షడ్వర్గీయ భిక్షువు

శ్లో॥ సబ్బే తసంతి దండస్స,సబ్బే భయన్తి మచ్చునో।
అత్తానం ఉపమం కత్వా, న హానెయ్య, న ఘాతయే ॥

తా॥ అన్ని జీవులు దెబ్బలకు భయపడును మృత్యువుకు వెరచును తన వలెనే ప్రాణులన్నియని తలంచి ఎవరికి హాని కల్గించకూడదు కొట్టకూడదు 129

శ్లో॥ సబ్బే తసంతి దండస్స, సబ్బేసం జీవితం పియం ।
అత్తానం ఉపమం కత్వా, న హానెయ్య న ఘాతయే ॥

తా॥ జీవులన్నియు దెబ్బలకు భయపడును ప్రాణులన్నిటికి జీవితము పై ప్రేమ ఉండును కావునా తనవలెనే ప్రాణులన్నియని తలంచి ఎవరికి హాని కల్గించ కూడదు, కొట్టగూడదు 130

స్థానము - జేతవనము వ్యక్తి - సంబాహుల కుమారుడు

శ్లో॥ సుఖకామాని భూతాని, యో దండేన విహింసతి ।
అత్తనో సుఖమేసానో, పేచ్చసోనలభతే సుఖం ॥

తా॥ తన సుఖము కొరకై ఇతర ప్రాణులను శస్త్రం తో హింసించే వానికి ఇక్కడే కాదు, చచ్చిన తర్వాత కూడా సుఖము దొరుకదు 191

శ్లో॥ సుఖకామాని భూతాని, యో దండేన న హింసతి ।
అత్తనో సుఖమేసానో, పేచ్చసో లభతే సుఖం ॥

తా॥ తన సుఖము కొరకై ఇతర ప్రాణులను బాధింపనివాడు ఇక్కడే కాదు, మరణానంతరము కూడా సుఖమును పొందుడురు

స్థానము - జేతవనము వ్యక్తి - కుండధాన థేరుడు

శ్లో॥ మావో చ ఫరుసం కఙ్చి, ఙుత్తా పటివదెయ్యుతం ।
దుక్ఖా హి సారంభకథా, పటిదండా ఫుసెయ్యుతం ॥

తా॥ కొంచెమైనను కఠోర వచనము లాడకుము నీవు కఠినముగా మాటాడినచో పరులును నీపట్ల అట్లే వర్తింతురు అందువలన కోపము, ఆ కోపము వలన దుఃఖము కలుగును నీ మాటలు కల్గించు ఫలితమును నీవే అనుభవింప వలసి వచ్చును 193

శ్లో॥ స చే నెరెసి అత్తానం, కంసో ఉపహతో యథా ।
ఎస పత్తోసి నిబ్బానం, సారమ్భోతే న విజ్జతి ॥

తా॥ పగిలి పోయిన గిన్నె వలె నిన్ను నీవు నిశ్శబ్దముగా చేసికొంటివా నిర్వాణమును పొందుదువు ఇక నీ గురించి క్రోధ యుక్తవచనము లేదు 194

స్థానము -పూర్వారామము వ్యక్తి - విశాఖమొదలగు ఉపాసికలు

శ్లో॥ యథా దండేన గోపాలో,గావో పాచేతి గోచరం ।
ఎవం జరాచ మచ్చుచ, ఆయు పాచేన్తి పాణినాం॥

తా॥గొల్లవాడు ఆవులను కర్రతో అదలించుచూ మైదానము లోనికి తోలునట్లె, వృద్ధాప్య మరణములు సర్వ ప్రాణుల ఆయువును కొని పోవుచున్నవి 135

స్థానము - రాజగృహము(వేణువనము) వ్యక్తి - అజగర పేతుడు

శ్లో॥ అథ పాపాని కమ్మాని, కరం బాలో న బుజ్ఝతి ।
సో హి కమ్మేహి దుమ్మేధో అగ్గి దడ్ఢో వ తప్పతి ॥

తా॥ పాప కర్మలు చేయు నప్పుడు, దాని ఫలితముగా జ్వలించే అగ్నివలె సంతప్తుడ నగుదునని పాపికి తెలియదు 136

స్థానము -రాజగృహము వ్యక్తి - మహాకాత్యాయన థేరుడు

శ్లో॥ యో దండేన అదండేసు, అప్పదుట్ఠేసు దుస్సతి ।
దసన్న మఞ్ఞతరం ఠానం, ఖిప్పమేవ నిగచ్ఛతి॥

తా॥ శిక్షార్హులు కాని నిరపరాధ వ్యక్తులను ద్వేషించు వానికి త్వరితముగా యీక్రింద పేర్కొనబడిన పది శిక్షలలో ఏదో ఒకటి కలుగును 137

శ్లో॥ వేదన ఫరుసం జానిం, సరీరస్సచ భేదనం।
గరుకం వా పి ఆబాధ, చిత్తక్ఖేపం వ పాపుణే ॥
రాజతోవా ఉపసగ్గం, అబ్భక్ఖానం వ దారుణం
పరిక్ఖయవ ఙతీనం, భగానం వ పభఙ్గణం ॥
అథవస్స అగారని, అగ్గిడహాతి పావకో ।
కాయస్సభేదా దుప్పఙ్ఞో, నిరయం సోప పజ్జతి ॥

తా॥ ప్రచండవేదన, ధనహాని, శరీరము కృశించుట, పెద్ద వ్యాధి, ఉన్మాదము లేదా రాజు ద్వారా నష్టము, దారుణ నింద, అన్నదమ్ముల మరణము భోగములు క్షయించుట జరుగవచ్చును లేక వారి ఇండ్లు అగ్ని ప్రమాదంలో కాలిపోవును అట్టి దుర్బుద్ధి మరణించిన పిదప నరకమునకు పోవును 138,139,140

స్థానము - జేతవనము వ్యక్తి - బహుభణ్డిక భిక్షు

శ్లో॥ న నగ్గచరియా న జటా న పకా,
నానాసవా థణ్డిల సాయికా వా ।
రజో చ జల్లం ఉక్కుటికప్పధానం
సోధన్తి మచ్చం అవితిణ్ణ కఙ్ఖం ॥

తా॥ కోరికలను వదలని వాడు నగ్నముగా ఉండుటవలన గాని, శరీరముపై క్రిములు సుంచుకొనుటతోగాని, ఉపవాసము వలనగాని లేక నేలపై శయనించుట వలనగాని బురద పూసి

కొనుటతోగాని, హఠయోగాదికముల వలనగాని పవిత్రుడు కాజా
లడు । 141

స్థానము - జేతవనము వ్యక్తి సన్తతి మహామతుడు

శ్లో॥ అలంకతో చేపి సమం చరెయ్య, సన్తో దన్తోనియతో
బ్రహ్మచారీ।
సబ్బేసు భూతేసు నిధాయ దండం, సో బ్రాహ్మణో
సోసమణో సభిక్ఖు ॥

తా॥ సంపదలతో అలంకృతుడైనప్పటికి, సర్వ ప్రాణుల
పట్ల దయతో వ్యవహరించువాడు, సమభావము కలవాడు,
శాంతుడు, మనోనిగ్రహము కలవాడు, జితేంద్రియుడునగు వాడే
బ్రాహ్మణుడు, శ్రమణుడు మరియు భిక్షువు కూడా 142

స్థానము - జేతవనము వ్యక్తి - పిలోతిక థేరుడు

శ్లో॥ హిరినిసేధో పురిసో, కోచి లోకస్మిం విజ్జతి।
యోనిందం అప్పబోధతి, అస్సో భద్రో కసామివ ॥

తా॥ ఉత్తమాశ్వము కొరడాను సహింపనట్లుగా యీ
లోకములో నిందను సహింపని అభిమాన పురుషులెవ్వరు? 143

శ్లో॥ అస్సో యథా భద్రో కసానివిట్ఠో,
అతాపినో సంవేగినో భవాథ।

సద్ధాయ సోలేన చ వెరియేన
　　చ సమాధినా ధమ్మవినిచ్ఛయేన చ ॥
సమ్పన్న విజ్జచరణ పతిస్సతా,
　　పహస్సథ దుఃఖమిదం అనప్పకం ॥

తా॥ కొరడా దెబ్బతిన్న గుర్రమువలె నీవుకూడా పశ్చాత్తప్తుడవు, ప్రయత్నశీలుడవు కమ్ము! శ్రద్ధా శీల వీర్య సమాధులతో కూడిన ధర్మ నిశ్చయమును కలిగి, విద్యా సదాచార యుక్తుడవై స్మృతిమంతుడ వైనప్పుడే యీ మహా దుఃఖమును దాటిపోగలవు

స్థానము - జేతవనము　　　　వ్యక్తి - సుఖ్రశామశేరుడు

శ్లో॥ ఉదకం హి నయన్తి నేత్తికా, ఉసుకార నమయన్తి తేజనం।
　　దారుం నమయన్తి తచ్ఛకా,అత్తానం దమయన్తి సుబ్బతా॥17

తా॥ నీటిని కొనిపోవువాడు కాలువలు త్రవ్వును బాణములు తయారు చేయువాడు ములికిని వాడిగానొనర్చును వడ్రంగి కర్రను సక్రమముగా మలచును దీక్ష గలవారు తమ్ముతామే సరి చేసుకుందురు　　145

# జరావగ్గో ఏకాదసమో

## జరా వర్గము    పదకొండవ అధ్యాయము

స్థానము - జేతవనము    వ్యక్తి - విశాఖ సహాయిక

శ్లో॥ కో ను హాసో కిమానందో, నిచ్చం పజ్జలితే సతి ।
అంధకారేన ఓనద్ధా, పదీప న గవేసథ ॥

తా॥ యీ సంసారాగ్నిలో పడి నిత్యము కాలుతూ ఉంటే ఎక్కడి నవ్వు ? ఎక్కడి ఆనందము ? అంధకారముతో చిక్కుక పోయిన నీవు దీపముకై ఏల వెదకవు ?    146

స్థానము - రాజగృహము (వేణువనము)    వ్యక్తి - సరిమా

శ్లో॥ పస్స చిత్తకతం బింబం, అరుకాయ సముస్సితం ।
ఆతురం బహుసంకప్పం, యస్స నత్థి ధువంఠితి ॥

తా॥ వస్త్రాది అలంకారములతో శోభించునదియు, అనేక గాయములతో కూడినదియు, మాంసాది ధాతువులతో వికసించినదియు, అనేక దుఃఖములతో పీడింప బడునదియు, అనేక సంకల్పముతో కూడినదియగు ఈ దేహమునకు స్థాయీ స్థిరత్వములు లేవు    147

స్థానము - జేతవనము వ్యక్తి - ఉత్తరి థేరి.

శ్లో॥ పరిజిణ్ణమిదం రూపం, రోగనీలం పభంగురం ।
ఝిజ్జతి పూతిసన్దో, మరణంతం హి జీవితం ॥

తా॥ యీ శరీరము జీర్ణవిదీర్ణమగునది, రోగ నిలయమును క్షణభంగురమునైనట్టిది దుర్గంధ పూరితమగు యీ శరీరము నశించి పోవును ఏలనన జీవితము మరణించు వరకేకదా। 148

స్థానము - జేతవనము వ్యక్తి - అధిమాన భిక్షు

శ్లో॥ యాని మాని అపత్థాని, అలాబూనేవ సారదే।
కాపోత కాని అట్ఠీని, తాని దిస్వాని కారతి ॥

తా॥ శరత్కాలమున ఎండిన సొరకాయవలె పావురము యొక్క రంగుగల యీ ఎముకలను చూసిన, వానిపై ప్రేమ ఎట్లు కల్గును ? 149

స్థానము - జేతవనము వ్యక్తి - రూపనంద థేరి

శ్లో॥ అట్ఠీనం నగరం కతం, మంసలోహిత లేపనం ।
యత్థ జరా చ మచ్చుచ, మానో మక్ఖోచ ఒహితో ॥

తా॥ ఎముకలతో ఒక నగరము(దేహము)నిర్మింప బడినది దానిపై రక్తమాంసములు పూయబడినవి దానిలో వృద్ధాప్యము, మృత్యువు, అజ్ఞానము, అభిమానము దాగియున్నవి 150

స్థానము - జేతవనము వ్యక్తి - మల్లికాదేవి

శ్లో॥ జీరంతి వే రాజరథాసుచిత్తా, అథో శరీరం పి జరంఉపేతి,
సతం చ ధమ్మో, న జరం ఉపేతి, సన్తో హవే సబ్భి
పవేదయన్తి ॥

తా॥ చక్కగా అలంకరింపబడిన రాజు యొక్క రథము జీర్ణ శీర్ణమగునట్లు యీ శరీరము కూడా వృద్ధావస్థను పొందును కాని సంతులగు మహాత్ముల ధర్మమెన్నడును వృద్ధావస్థను పొందదని సత్పురుషులు సజ్జనులతో చెప్పుదురు 151

స్థానము - జేతవనము వ్యక్తి - ఉదాయి థేరుడు

శ్లో॥ అప్పస్సుతాయం పురిసో, బలిబద్దో వ జీరతి ।
మాంసాని తస్స వడ్ఢంతి, పఞ్ఞతస్స న వడ్ఢతి॥

తా॥ అల్పజ్ఞుడగు మానవుడు, ఎద్దువలె వృద్ధుడగును వాని మాంసాదులు పెరుగును, కాని బుద్ధి మాత్రం పెరగదు 152

స్థానము - బోధి వృక్షమూలము ఆనందథేరుడు విన్నది

శ్లో॥ అనేక జాతి సంసారం, సంధావిస్సం అనిబ్బిసం ।
గహకారం గవేసంతో, దుక్ఖాజాతి పునప్పునం ॥

తా॥ యీ అజ్ఞాన రూపములో నున్న గృహము యొక్క నిర్మాతను వెదకుచూ, జ్ఞాన ప్రాప్తి కానంత వరకు అనేక

జన్మముల నెత్తుచూ సంసారములో పరుగెత్తితిని మరల మరల దుఃఖముల ననుభవించితిని 153

శ్లో॥ గహకారక దిట్ఠోసు, పున గేహం న కాహసి ।
సబ్బా తే ఫాసుకా భగ్గా, గహకూటం విసంఖతం ॥
విసంఖారగతం చిత్తం, తణ్హానం, ఖయమజ్ఝగా ॥

తా॥ ఓ గృహనిర్మాతా ! నిన్ను కనుగొంటిని ఇక నీవు ఇంటిని నిర్మింప లేవు నీ ఇంటి యొక్క వాసములన్నియు విరిగి పోయినవి గృహ శిఖరము కూలి పోయినది చిత్తము సంస్కారముల నుండి ముక్తి పొందినది తృష్ణ నశించినది 154

స్థానము ఋషిపతనమృగదావము వ్యక్తి మహాధన శ్రేష్ఠిపుత్రుడు

శ్లో॥ అచరిత్వా బ్రహ్మచరియం, అలద్ధా యొబ్బనే ధనం ।
జిణ్ణ కోఞ్చా, వ ఝాయన్తి ఖీణ మచ్ఛే వ పల్లలే ॥

తా॥ బహ్మచర్యా చరణ లేక యవ్వనములో ధన సంపాదన చేయని నరుడు, చేపలు లేని చెరువులో ముసలి కొంగవలె వృద్ధాప్యములో చింతించును 155

శ్లో॥ అచరిత్వా బ్రహ్మచరియం, అలద్ధా యొబ్బనే ధనం ।
సేన్తి చాపాతిఖీణావ, పురాణాని అనుత్థునం ॥11॥

తా॥ బ్రహ్మ చర్యమును పాటింపక, యవ్వనముతో ధన సంపాదన చేయనివాడు వృద్ధావస్థలో అత్యంత బలహీనమగు ధనుస్సువలె గత విషయముల గురించి ఆలోచించుచూ పడి ఉండును

# అత్తవగ్గో ద్వాదసమో

## ఆత్మవర్గము పండ్రెండవ అధ్యాయము

స్థానము :- సుంసుమారగిరి వ్యక్తి - బోధిరాజకుమారుడు

శ్లో॥ అత్తానం చే పియం జఞ్ఞా, రక్ఖేయ్య నం సురక్ఖితం ।
తిణ్ణమఞ్ఞతరం యామం, పటిజగ్గేయ్య పండితో ॥

తా॥ ఆత్మను ప్రియమను కొంటివా దానిని సురక్షితముగా నుంచుము విద్వజ్జనుడు రాత్రి మూడు జాములలో ఒకదాని యందవశ్యము మేలు కొని యుండును 157

రాత్రికి మూడు జాములు రాత్రిలోని చివరి మూడు గంటలలో అనగా తెల్లవారు జామున మూడు గంటల నుండి ఆరు గంటల వరకు ధ్యానములో గడపవలెను

స్థానము - జేతవనము వ్యక్తి - శాక్యపుత్ర ఉపనంద థేరుడు

శ్లో॥ అత్తానమేవ పఠమం, పతిరూపే నివేసయే ।
అథఞ్ఞమనుసాసెయ్య, న కిలిసెయ్య పండితో ॥

తా॥ మొదట తాను సన్మార్గమున నడచి పిదప పరులకు ఉపదేశింప వలెను ఇట్లు చేసినచో కష్టములు కలుగవు 158

స్థానము - జేతవనము వ్యక్తి - పధానిక తిష్య థేరుడు

శ్లో॥ అత్తాన చే తథా కరియా, యథఞ్ఞమనుసతి ॥
సుదన్తో వత దమేథ, అత్తాహి కిరదుద్ధమో ॥

తా॥ ఇతరులకు ఉపదేశించువాడు ఆ ఉపదేశ ప్రకారము మొదట తాను నడవవలెను మొదట తన మనస్సును జయించవలెను ఇతరులకు ఉపదేశించుట కన్న తనను జయించుటే కఠినము 159

స్థానము - జేతవనము వ్యక్తి - కుమారకశ్యపమాత థేరి

శ్లో॥ అత్తాహి అత్తనో నాథో, కో హి నాథో పరో సియా ।
అత్తనా హి సుదన్తేన, నాథం లభతి దుల్లభం ॥

తా॥ మానవుడు తనకు తానే యజమానుడు పరులెవ్వరాతని యజమానుడు కాగలరు ? తనను చక్కగా నిగ్రహించుకొన్నవాడు దుర్లభమగు అట్టి స్వామిత్వమును పొందుచున్నాడు 160

స్థానము - జేతవనము వ్యక్తి - మహాకాల ఉపాసకుడు

శ్లో॥ అత్తనా హి కతం పాపం, అత్తజం అత్తసంభవం ।
అభిమన్థతి దుమ్మేధం, వజిరం వస్మయం మణిం ॥

తా॥ రాతి నుండి పుట్టిన వజ్రము రాతినుండే పుట్టిన మణిని కోసినట్లు, తాను చేయగా, తన నుండే పుట్టిన పాపముచే దుర్బుద్ధి గలవాడు నశించును 161

స్థానము - వేణువనము వ్యక్తి - దేవదత్తుడు

శ్లో॥ యస్స అచ్చన్త దుస్సీల్యం, మాలువా సాలమివే తతం ।
కరోతి సో తథత్తానం, యథా నం ఇచ్ఛతి దిసో ॥

తా॥ ఎవని ఘోర దురాచారము మాలువా లత వ్యాపించిన టేకు చెట్టు వలె బాగుగా పెరిగినదో, వాడు తనకు తానే శత్రువు వలె వర్తించి నశించును 162

మాలువాలత - ఇది గిన్నెల వంటి ఆకులు గల ఒక రకమైన తీగ వర్షపునీరుదాని ఆకులలో నిండినపుడు ఎంత పెద్ద వృక్షమైనను సులభముగా కూలి పోవును

స్థానము - రాజగృహము వ్యక్తి - బుద్ధభగవానుడు

శ్లో॥ సుకరాని అసాధూని, అత్తనో అహితానిచ ।
యంవే హితంచ సాధుంచ తంవే పరమదుక్కరం ॥

తా॥ క్రూరములును, తనకు కీడును కల్గించు నవియునగు పనులు చేయుట చాలా సులభము మేలును కల్గించు నవియు, మంచివియు నగు పనులు చేయుట చాలా కఠినము 163

స్థానము - జేతవనము వ్యక్తి - కాంథేరుడు

శ్లో॥ యో సాసనం అరహతం, అరియానం ధమ్మ జీవినం ।
పటిక్కోసతి దుమ్మేధో, దిట్ఠిం నిస్సాయ పాపికం ।
ఫలాని కట్ఠకస్సేవ, అత్త ఘాతాయ ఫల్లతి ॥

తా॥ వెదురును ఫలములు నశింపజేయు నట్లు, పాపమయ దృష్టి గలవాడై ధర్మజీవులగు శ్రేష్ఠ అర్హతుల బోధను నిందించు దుర్బుద్ధిని ఆ దుష్కర్మ నశింపజేయును 164

స్థానము - జేతవనము వ్యక్తి - చుల్లకాల ఉపాసకుడు

శ్లో॥ అత్తనా హి కతం పాపం, అత్తనా సకిలిస్సతి ।
అత్తనా అకతం పాపం, అత్తనా వ విసుజ్ఝతి ।
సుద్ధి అసుద్ధి పచ్చత్తం, నాఞ్ఞో అఞ్ఞ విసోధయే ॥

తా॥ పాపము చేయుట వలన మనము కష్టపడుదుము పాపము చేయనిచో పరిశుద్ధుల మగుదుము పరిశుద్ధులమగుట, కాక పోవుట మనమీదనే ఆధారపడిఉండును ఎవ్వరూ ఇతరులను పరి శుద్ధులుగా చేయ జాలరు 165

స్థానము - జేతవనము వ్యక్తి - అత్మదంత థేరుడు

శ్లో॥ అత్త దత్థం పరత్థేన, బహునా పి న హాపయే ।
అత్తదత్థమభిఞ్ఞాయ, సదత్థపసుతో సియా ॥ 10

తా॥ ఇతరులకు ఎక్కువ మేలు జరుగు నట్లున్నను మన హితమును వదల గూడదు మనహితమును కాపాడు కొనుచూ, ఇతరుల మేలుకై శ్రమించ వలెను 16౬

---*---

# లోకవగ్గో తేరసమో

## లోకవర్గము : పదమూడవ అధ్యాయము

స్థానము - జేతవనము వ్యక్తి - అజ్ఞతర దహర భిక్షు

శ్లో॥ హీనం ధమ్మం న సేవెయ్య, పమాదేన న సంవసే ।
మిచ్ఛాదిట్ఠిం న సేవెయ్య, న సియా లోకవడ్ఢనో ॥

తా॥ నీచధర్మమును సేవింప గూడదు ఏమరు పాటుగా ఉండ కూడదు మిథ్యా దృష్టిని ఆశ్రయింప కూడదు సంసార యాత్రను పెంచుకో కూడదు 167

స్థానము - న్యగ్రోధారామము వ్యక్తి - శుద్ధోదనుడు

శ్లో॥ ఉత్తిట్ఠే నప్పమజ్జెయ్య, ధమ్మ సుచరితం చరే ।
ధమ్మ చారీ సుఖం సేతి, అస్మిం లోకే పరమ్హిచ ॥

తా॥ లెమ్ము ! పొరపాటు చేయకుము ! సదాచార యుక్తమగు ధర్మము నాచరింపుము ధర్మము నాచరింప వాడు ఇహ-పరము లందును సుఖముగా నిద్రించును 168

శ్లో॥ ధమ్మం చరే సుచరితం, న నం దుచ్చరిత చరే ।
ధమ్మచారీ సుఖంసేతి, అస్మిం లోకే పరమ్హిచ ॥

తా॥ సదాచార యుక్తమగు ధర్మమును ఆచరింప వలెను దురాచార యుక్తమగు ధర్మమును ఆచరింప గూడదు ధర్మము నాచరించు వాడు ఇహ-పరములందును సుఖముగా నిద్రించును

స్థానము - జేతవనము వ్యక్తి - పంచశత విపస్యక భిక్షు

శ్లో॥ యథా బుబ్బులకం పస్సే, యథా పస్సే మరీచికం ।
ఏవం లోకం అవెక్ఖంతం, మచ్చురాజా న పస్సతి ॥

తా॥ యీ లోకమును నీటిమీది బుడగ వలె, ఎడారిలో ఎండమావి వలె భావించు వ్యక్తిని యమరాజు సమీపింపడు 170

స్థానము - రాజగృహము వ్యక్తి - అభయ రాజకుమారుడు.

శ్లో॥ ఏథ పస్సథిమ లోకం, చిత్తం రాజరథూపమం ।
యత్థ బాలా విసీదన్తి, నాత్థి సంగో విజానతం ॥

తా॥ రమ్ము ! రాజుయొక్క రథము వలె విచిత్రమగు యీ సంసారమును చూడుము మూర్ఖుడు దీనియందు దుఃఖించు చున్నాడు విజ్ఞుడు అనాసక్తుడగు చున్నాడు 171

స్థానము - జేతవనము వ్యక్తి - సమ్యక్ జ్ఞాని థేరి

శ్లో॥ యో చ పుబ్బే పమజ్జిత్వా, పచ్ఛా సో నప్పమజ్జతి ।
సో ఇమం లోకం పభాసేతి, అబ్భాముత్తో వ చన్దిమా॥

తా॥ ఒకసారి పొరపాటు చేసినప్పటికిని, దానిని గ్రహించి అప్రమత్తుడై యుండు వాడు, మేఘముల నుండి వెడలు చంద్రుని వలె లోకమును ప్రకాశింప జేయును 172

స్థానము - జేతవనము వ్యక్తి - అంగుళీమాల థేరుడు

శ్లో॥ యస్స పాపం కతం కమ్మం, కుసలేన పిధీయతి ।
సోఽమం లోకం పభాసేతి, అబ్బా ముత్తోవ చన్దమా ॥

తా॥ ఎవని పుణ్య కర్మల ముందు పాపకర్మలు వీగి పోయి నవో,వాడు మేఘముక్తుడగు చంద్రుని వలె లోకమును వెల్గించును

స్థానము - అగ్రాలవ చైత్యము వ్యక్తి - పేసకార ధీత

శ్లో॥ అంధభూతే అయం లోకే, తనుకేత్థ విపస్సతి ।
సకుణో జాలముత్తో వ, అప్పో సగ్గాయ గచ్ఛతి ॥

తా॥ యీ లోకము గ్రుడ్డిది ఇక్కడ కొద్దిమంది మాత్రమే చూడగలరు వల నుండి తప్పిన పక్షివలె ఏ ఒక్కరో స్వర్గమునకు పోవుదురు 174

స్థానము - జేతవనము వ్యక్తి - తింస భిక్షు

శ్లో॥ హంసాదిచ్చ పథేయన్తి, ఆకాసో యన్తి ఇద్ధియా ।
నీయన్తి ధీరా లోకమ్హా, జేత్వా మార సవాహినిం ॥

తా॥ హంస ఆకాశమున ఎగిరి పోవును సిద్ధి ప్రాప్తుడు కూడా ఆకాశములో ఎగర గలడు ధైర్యశాలురు సేనాసహితుడగు మారుని జయించి సంసారమునుండి వెడలి పోవుదురు 175

స్థానము - జేతవనము వ్యక్తి - చించామాణవిక

శ్లో॥ ఏకం ధమ్మం అతీతస్స, ముసావాదిస్స జంతునో ।
వితిణ్ణ పరలోకస్స, నాత్థిపాపం అకారియం ॥

తా॥ సత్యమును అతిక్రమించు వారు, మృషావాదులు, పరలోక విషయమున ఉదాసీనులును అగు వారికి చేయరాని పాప మనునది లేదు 176

స్థానము - జేతవనము అసదిస దాన సంబంధమున

శ్లో॥ న వే కదరియ దేవలోకం వజన్తి,
బాలా హవే నప్పసంసన్తి దానం ।

ధీరో చ దానం అనుమోద మానో,
తేనేవ సో హోతి సుఖీ పరత్థ ॥

తా॥ పిసినారులు దేవలోకమునకు పోజాలరు మూర్ఖులు దానమును ప్రశంసించరు కాని ధీరులు దానము నంగీకరించి, దాని వలన పరలోకమున కూడా సుఖింతురు 177

స్థానము - జేతవనము వ్యక్తి - అనాథపిండక పుత్రకాలుడు

శ్లో॥ పథవ్యా ఎకరజ్జేన, సగ్గస్స గమనేనవా ।
సబ్బలోకాధిపచ్చేన, సోతాపత్తి ఫలం వరం ॥ 12

తా॥ పృథివి యొక్క ఏకచ్ఛత్రాధిపత్యము కన్న, స్వర్గమునకు పోవుట కన్న, సమస్త లోకముం అధిపత్యము కన్న, స్రోతపత్తి ఫలము గొప్పది 178

స్రోతాపత్తి ఫలము - ముముక్షుత్వము ముక్తి సాధనకై ఉద్యమించి ఎట్టి పరిస్థితులందైనను దానినుండి జారిపోని దీక్ష గలవాడగుట

---

# బుద్ధవగ్గో చుద్దసమో

## బుద్ధ వర్గము - పదునాలుగవ అధ్యాయము

స్థానము - బోధి మంటపము వ్యక్తి - మారుడు

శ్లో॥ యస్స జితం నావజేయతి,జిత్తంయస్స నోయాతి కోచిలోకే।
తం బుద్ధమనన్త గోచరం, అపదంకేన పదేన నేస్సథ ॥

తా॥ అనంత జ్ఞాన సంపన్నుడైన బుద్ధుని అపమార్గమునకు ఎవరు మళ్లించ గలరు ? అతడు అపరాజితుడు 179

శ్లో॥ యస్స జాలినీ విసత్తికా, తణ్హానాత్తి కుహిఞ్చనేతవే ।
తం బుద్ధమనన్త గోచరం, అపదం, కేనపదేన నేస్సథ ॥

తా॥ బంధనకారియు, విషరూపియు నగు తృష్ణ ఎవరిని చలింపజేయ జాలదో అట్టి అనంత గోచరుడు పదరహితుడు నగు బుద్ధుని ఏ ఉపాయముచే పడగొట్టగలరు ? 180

స్థానము -సంకాశ్యప నగర ద్వారము వ్యక్తి -బహుదేవమనుష్యులు

శ్లో॥ యే ఝాను పసుతాధీరా, నేక్ఖమ్మూప సమే రతా ।
దేవాపి తేసం పిహియన్తి, సమ్బుద్ధానం సతోమతా ॥

తా॥ ధ్యానమగ్నులు, ధీరులు, ప్రవ్రజ్య ద్వారా ఉపశాంతిని పొందిన వారు నగు స్మృతిమంతులగు జ్ఞానులను దేవతలు కూడా స్మరింతురు 181

స్థానము - వారణాసి వ్యక్తి - ఎరక పట్ట నాగరాజు

శ్లో॥ కిచ్ఛో మనుస్సపటిలాభో, కిచ్ఛ మన్చాన జీవితం ।
కిచ్ఛం సద్ధమ్మస్సవనం, కిచ్ఛోబుద్ధానముప్పదో ॥

తా॥ మానవ జన్మ లభించుట కఠినము లభించినను మానవుడుగా జీవించుట కఠినము జీవించినను సద్ధర్మమును వినుట కఠినము బుద్ధులగుట ఇంకను కఠినము 182

స్థానము - జేతవనము వ్యక్తి - ఆనంద భిక్షువు,

శ్లో॥ సబ్బపాపస్స అకరణం, కుసలస్స ఉపసంపదాం ।
సచిత్త పరియోదపనం, ఎతం బుద్ధాను సాసనం ॥

తా॥ ఏ పాపము చేయకుండుట, పుణ్యకర్మలు చేయుటలో దీక్షితుడగుట, చిత్తమును పరిశుభ్రముగా నుంచుకొనుట ఇదియే బుద్ధుల శిక్షావిధి 183

శ్లో॥ ఖన్తి పరమం తపోతితిక్ఖా,
నిబ్బాణం పరమ వదన్తి బుద్ధా ।
న హి పబ్బజితో పరూప ఘాతో,
సమణో హోతి పరం విహేఠయన్తో ॥

తా॥ క్షమా సహన శీలతలే పరమ తపము నిర్వాణమే పరమ పదమని బుద్ధులు వక్కాణింతురు ఇతరుల కష్టపెట్టు వాడు ప్రవ్రజితుడు కాలేడు పరుం అసహ్యంగకొను వాడు శ్రమణుడు కాజాలడు 184

శ్లో॥ అనూపవాదో అనూప ఘాతో, పాతిమోక్ఖేచ సంవరో ।
మత్తఞ్ఞుతా చ భత్తస్మిం, పంతంచ శయనాసనం ॥
అధిచిత్తే చ ఆయోగో, ఎతం బుద్ధానం సాసనం ॥

తా॥ నిందింపకుండుట, హాని కల్గింప కుండుట, ప్రాతిమోక్ష నియమాధీన సంయమము, మితాహారము తీసికొనుట, ఏకాంత మున శయనించుట, కూర్చుండుట, చిత్తవృత్తుల నిరోధించుట ఇవి బుద్ధుల శిక్షావిధులు 185

స్థానము - జేతవనము  వ్యక్తి - అసభిరత భిక్షు

శ్లో॥ న కహాపణ వరసేన, తిత్తికామేసు విజ్జతి ।
అప్పసాదా దుఖా కామా, ఇతి విఞ్ఞాయ పండితో ॥
అపిదిబ్బేసు కామేసు, రతిం సో నాధిగచ్ఛతి ।
తణ్హక్ఖయ రతో హోతి, సమ్మా సంబుద్ధ సావకో ॥

తా॥ [1]కార్షాపణముల వర్షము కురిసినను భోగము లందు తృప్తి కలుగదు సకల భోగము లందును సుఖము తక్కువ,

1 బంగారు నాణెముల

దుఃఖమెక్కువ అని గ్రహించి విద్వజ్జనులు స్వర్గ భోగము లందు సహితము ఆసక్తులు కారు సమ్యక్ సంబుద్ధుని అనుయాయు లగు వారు తృష్ణాక్షయమున నిమగ్నులై యుందురు 186, 187

స్థానము - జేతవనము వ్యక్తి - అగ్నిదత్త బ్రాహ్మణుడు

శ్లో॥ బహుం వే సరణం యన్తి, పబ్బతాని బనాని చ ।
ఆరామ రుక్ఖ చేత్యాని, మనుస్సా భయతజ్జితా ॥

తా॥ భయ భీతులగు మానవులు, పర్వతములు, వనోప వనములు,వృక్షములు,చైత్యములు మొదలగు వాటిని శరణు పొందు దురు 188

శ్లో॥ నేతం ఖో సరణం ఖేమ నేతం సరణముత్తమం ।
నేతం సరణ మాగమ్మ, సబ్బాదుఃక్ఖాపముచ్చతి ॥

తా॥ ఇట్టి శరణము శుభప్రదము కాదు ఉత్తమమైనది కాదు ఇట్టి శరణము వలన ఎవ్వరును సకల దుఃఖముల నుండి ముక్తులు కాజాలరు

శ్లో॥ యో చ బుద్ధం చ ధమ్మంచ, సంఘం చ సరణంగతో।
చత్తారి అరియ సచ్చాని, సమ్మప్పఞ్ఞాయ పస్సతి ॥
దుక్ఖం, దుక్ఖ సముప్పాద, దుక్ఖస్స చ అతిక్కమం ।
అరియంచట్ఠాఙ్గికం మగ్గం, దుక్ఖూప సమగామినం ॥

తా॥ బుద్ధుని, అతని ధర్మమును మరియు అతని సంఘమును శరణుజొచ్చిన వారు, చతురార్య సత్యములగు 1) దుఃఖము, 2) దుఃఖకారణము 3) దుఃఖనిరోధగామినీ ప్రతి పదమగు ఆర్య అష్టాంగిక మార్గమును సమ్యక్ ప్రజ్ఞతో దర్శింతురు 190, 191

1) చతురార్య సత్యములు - దుఃఖము యీలోకము దుఃఖమయము

2) దుఃఖసముదయము - యీ దుఃఖమునకు కారణము న్నది అదియే తృష్ణ

3) దుఃఖనిరోధము - ఆ తృష్ణను నిరోధింప వచ్చును

4) దుఃఖ నిరోధగామిని ప్రతిపదము - దుఃఖమును నిరోధించుటకు అనుసరింపదగు మార్గము అది 1) సమ్యక్ దృష్టి 2) సమ్యక్ సంకల్పము 3) సమ్యక్ వచనము 4) సమ్యక్ కర్మ 5) సమ్యక్ ఆజీవము 6) సమ్యక్ వ్యాయామము 7) సమ్యక్ స్మృతి 8) సమ్యక్ సమాధి అను ఎనిమిది నియమములతో కూడి ఉండుట వలన అష్టాంగ మార్గమని పిలువ బడినది

శ్లో॥ ఎతం ఖో సరణం ఖేమం, ఎతం సరణముత్తమం ।
ఎతం సరణ మాగమ్మ, సబ్బ దుక్ఖాపముచ్చతి ॥

తా॥ ఈ శరణము నిశ్చయముగా శుభప్రదమైనది ఇది ఉత్తమ శరణము దీనిని ఆశ్రయించిన వారు సర్వ దుఃఖములనుండి ముక్తులు కాగలరు 192

స్థానము - జేతవనము వ్యక్తి - ఆనంద థేరుడు

శ్లో॥ దుల్లభో పురిసాజఞ్ఞో, న సో సబ్బత్థ జాయతి ।
యత్థసో జాయతి ధీరో, తం కుల సుఖమేధతి ॥

తా॥ యీ జన్మలోనే ముక్తిని పొందు మహా పురుషులు అరుదుగా జన్మింతురు అట్టి ధీరులు జన్మించిన వంశమున సుఖ సంపదలు పెరుగును 193

స్థానము - జేతవనము వ్యక్తి - సంబాహుల భిక్షు

శ్లో॥ సుఖో బుద్ధానముప్పాదో, సుఖా సద్దమ్మ దేసనా ।
సుఖా సంఘస్స సామగ్గీ, సమగ్గానం తపో సుఖో ॥

తా॥ బుద్ధుల జన్మము సుఖకారిణి సద్ధర్మోపదేశము సుఖ కారిణి సంఘములో ఐకమత్యము సుఖదాయిని ఏకీకృతులగు వ్యక్తుల యొక్క తపము సుఖ ప్రదాయిని 194

స్థానము - సువర్ణ చైత్యము వ్యక్తి - దశబలుడు (బుద్ధుడు)

శ్లో॥ పూజారహే పూజయతో, బుద్ధో యది వ సావకే
పపఞ్చ సమతిక్కంతో, తిణ్ణ సోక పరిద్ధవే ॥

తే తాదిసో పూజయతో, నిబ్బుతో అకుతోభయే ।
నసక్కా పుఞ్ఞం సంఖాతుం, ఇమే త్తమపి కేనపి ॥ 1€

తా॥ పూజార్హులగు వ్యక్తులు, బుద్ధుని అనుయాయులు, సకల సాంసారిక విషయదూరులు, శోకనదమును తరించు వారు నగు ముక్తులు మరియు నిర్భీకులను పూజించు వ్యక్తి యొక్క పుణ్యము ఇంతింత యనరానిది 195, 196



# సుఖవగ్గో పన్నరసమో

## సుఖ వర్గము • పదిహేనవ అధ్యాయము

స్థానము - శాక్యదేశము వ్యక్తి - జాతకుడు.

శ్లో॥ సుసుఖం వతజీవామ, వేరినేసు అవేరినో ।
వేరినేసు మనుస్సేసు, విహరామ అవేరినో ॥

తా॥ శత్రువుల పట్ల అశత్రుతతో వ్యవహరించు వారు నిజమునకు సుఖముగా జీవింతురు శత్రుమనుష్య మధ్యమున మనము అశత్రుతతో విహరింతుము ।

197

శ్లో॥ సుసుఖం వతజీవామ, ఆతురేసు అనాతురా ।
ఆతురేసు మనుస్సేసు, విహరామ అనాతురా ॥

తా॥ అభిమానము, ఈర్ష్య మొదలగు వానిచే ఆతురులగు వ్యక్తుల మధ్యమున అనాతురులమైనచో మనము సుఖముగా జీవింతుము ఆతురులగు వ్యక్తుల మధ్య అనాతురులమై విహరింతుము

శ్లో॥ సుసుఖం వతజీవామ, ఉస్సుకేసు అనుస్సుకా ।
ఉస్సుకేసు మనుస్సేసు, విహరామ అనుస్సుకా ॥

తా॥ లాలసతో కూడిన వ్యక్తుల మధ్యమున లాలసారహితుల మైనవో సుఖముగా జీవింతుము లాలసాపూర్ణులగు వ్యక్తుల మధ్యమున లాలసారహితులమై విహరింతుము 199

స్థానము - పంచశాలా బ్రాహ్మణగ్రామము వ్యక్తి - మారుడు

శ్లో॥ సుసుఖం వతజీవామ, యేసం నో నత్థి కిఞ్చన ।
పీతి భక్ఖా భవిస్సామ, దేవా ఆభస్సర యథా ॥

తా॥ ఏమియు లేనివారే వాస్తమున సుఖముగా జీవింతురు వారు తేజస్వరూపులగు దేవతల వలె ఆనంద భోజులగుదురు 200

స్థానము - జేతవనము వ్యక్తి - బుద్ధ భగవానుడు

శ్లో॥ జయం వేర పససతి, దుక్ఖం సేతి పరాజితో ।
ఉపసంతో సుఖం సేతి, హిత్వాజయ పరాజయ ॥

తా॥ విజయము వైరమును కలుగ జేయును పరాజితుడు దుఃఖితుడై నిద్రించును జయ-పరాజయముల వదలిన పూర్ణ శాంతుడు సుఖముగా నిద్రించును 201

స్థానము - జేతవనము వ్యక్తి - అజ్ఞాతర కుల కన్య

శ్లో॥ నాత్థి రాగ సమో అగ్ని, నాత్థి దోస సమో కలి ।
నాత్థి ఖంధ సమా దుక్ఖా, నాత్థిసన్తి పరంసుఖ ॥

తా॥ రాగము వంటి అగ్నిలేదు ద్వేషము వంటి పాపము లేదు లోకము (పునర్జన్మ) వంటి దుఃఖము లేదు శాంతి వంటి సుఖము లేదు 202

స్థానము - ఆలవి వ్యక్తి - ఏక ఉపాసకుడు

శ్లో॥ జిఘచ్ఛా పరమారోగా, సంఖార పరమాదుఖా ।
ఎతం ఞత్వా యథాభూతం, నిబ్బానం పరమంసుఖ ॥

తా॥ కోరికను మించిన రోగము లేదు పునర్జన్మను మించిన దుఃఖము లేదు దీనిని గ్రహించి నిర్వాణమే పరమ సుఖమని తెలియుము 203

స్థానము - జేతవనము వ్యక్తి - కోసలరాజు ప్రసేనజిత్తు

శ్లో॥ ఆరోగ్య పరమా లాభా, సంతుట్ఠి పరమం ధనం ।
విస్సాస పరమ ఞాతి, నిబ్బాణం పరమం సుఖం ॥

తా॥ ఆరోగ్యమే పరము లాభము సంతృప్తి యే పరమ ధనము విశ్వాసమే పరమబంధువు నిర్వాణమే పరమ సుఖము 204

స్థానము - వైశాలి వ్యక్తి - తిష్య థేరుడు

శ్లో॥ పవివేక రసం పిత్వా, రసం ఉపసమస్సచ ।
నిద్దరో హోతి నిప్పాపో, ధమ్మ పీతి రసం పిబం ॥

తా॥ వివేక శాంతి రసముల గ్రాగి (శాంతి వివేకములను పొంది) ధర్మానంద రసమును ఆస్వాదించువారు పాప రహితులు నిర్భయులు కాగలరు 205

స్థానము - వేణువనము వ్యక్తి - సక్క

శ్లో॥ సాధు దస్సన మరియానం, సన్నివాసో సదా సుఖో ।
అదస్సనేన బాలానం, నిచ్చమేవ సఖీసియా ॥

తా॥ ఆర్యుల దర్శనము శుభప్రదము సాధువుల సహచర్యము సుఖదాయిని మూర్ఖుల అదర్శనము సదా సుఖకారిణి 206

శ్లో॥ బాలసంగత చారీ హి, దీఘ మద్దాన సోచతి ।
దుఃఖో బాలేహి సంవాసో, అమిత్తనేవ సబ్బదా ।
ధీరోచ సుఖ సంవాసో, ఞాతీనం వ సమాగమో ॥

తా॥ మూర్ఖసహవాసము చేయువాడు చాలావరకు దుఃఖమునే పొందును శత్రువులతో నివాసము వలె మూర్ఖులతో నివాసము దుఃఖమును కల్గించును ధీరుల సన్నివాసము, బంధువుల సమాగమువలె సుఖమును కల్గించును 207

శ్లో॥ ధీరం చ పఞ్ఞంచ బహుస్సుతం చ, ధోరెయ్య సీలం వత వంత మారియం ।

తం తాదిసం సప్పురిసం సుమేధం, భజేథ నక్ఖత్త పథం వ చన్దమా ॥12

తా॥ చంద్రుడు నక్షత్ర మార్గము ననుసరించు నట్లు, ధీర ప్రాజ్ఞుడు, విద్వాంసుడు, శీలవంతుడు, నిష్ఠాపరుడు, శ్రేష్ఠుడు మరియు మేధావియగు పురుషుని అనుసరింప వలెను 208

—*—

# పియవగ్గో సోలసమో

## ప్రియ వర్గము    పదహారవ అధ్యాయము

స్థానము :- జేతవనము                    వ్యక్తి - తయో్ప్రవ్రజిత

శ్లో॥ ఆయోగో ముజ్జమత్తానం, యోగస్మించ అయోజయ ।
అత్థం హిత్వా పియగ్గాహీ, పియేతత్తాను యోగినం ॥

తా॥ చేయగూడని పనులు చేయుచూ,చేయ వలసిన పనులు చేయక, ప్రియముగా తోచు శబ్దాది సుఖముల మరగినవాడు ధ్యాన మగ్నుడగు యోగిని చూచి నేర్చుకొనవలెను    209

శ్లో॥ మా పియేహి సమాగించి, అప్పియేహి కుదాచనం ।
పియానం అదస్సనం దుఃఖం, అప్పియానంచ దస్సనం ॥

తా॥ ప్రియా ప్రియముల రెంటిని వదలుము! ఎందుకనగా ప్రియుల అదర్శనము, అప్రియుల దర్శనము దుఃఖమును కలిగించును    210

శ్లో॥ తరమా పియం న కయిరాథ, పియా పాయేహి పాపకో ।
గన్థాతేసం న విజ్జన్తి, యేసం నాత్థి పియాప్పియం ॥

తా॥ ఎవరిపైనను ప్రేమను కల్గిఉండకుము ప్రియ వియోగము కష్టకారిణి కదా ! ఎవనికి ప్రియా ప్రియములు లేవో వానికి బంధనము లేదు 211

స్థానము - జేతవనము వ్యక్తి - అజ్ఞతర కుటుంబిక

శ్లో॥ పియతో జాయతీ సోకో, పియతో జాయతీ భయం ।
పియతో విప్పముత్తస్స, నాత్థి సోకో కుతో భయం ॥

తా॥ ప్రియము నుండి శోకము కలుగును ప్రియము నుండి భయము జనించును ప్రియము నుండి విముక్తుడగు వ్యక్తికి భయశోకము లెక్కడివి ? 212

స్థానము - జేతవనము వ్యక్తి - విశాఖ ఉపాసిక

శ్లో॥ పేమతో జాయతీ సోకో, పేమతో జాయతీ భయం ।
పేమతో విప్పముత్తస్స, నాత్థి సోకోకుతో భయం ॥

తా॥ ప్రేమ నుండి శోకము ఉత్పన్నమగును ప్రేమ నుండి భయము జనించును ప్రేమ నుండి విముక్తుడగు వ్యక్తికి భయ శోకము లెక్కడివి ? 213

స్థానము - కూటాగారశాల వ్యక్తి - లిచ్ఛవి

శ్లో॥ రతియా జాయతి సోకో, రతియా జాయతి భయం ।
రతియా విప్పముత్తస్స, నాత్థి సోకో కుతోభయం ॥

తా॥ రతి నుండి శోకము కలుగును రతినుండి భయము జనించును రతి నుండి విముక్తుడగు వానికి భయశోకము లెక్కడివి ? 214

స్థానము - జేతవనము వ్యక్తి - అనిత్థిగంధ కుమారుడు

శ్లో॥ కామతో జాయతి సోకో, కామతో జాయతి భయం ।
కామతో విప్పముత్తస్స, నాత్థి సోకో కుతో భయం ॥

తా॥ కామము నుండి శోకము కలుగును కామము నుండి భయము జనించును కామ విముక్తుడగు వానికి భయశోకము లెక్కడివి ? 215

స్థానము - జేతవనము వ్యక్తి - అఙ్ఞతర బ్రాహ్మణుడు

శ్లో॥ తణ్హాయ జాయతి సోకో, తణ్హాయ జాయతి భయం ।
తణ్హాయ విప్పముత్తస్స, నాత్థి సోకో కుతో భయం ॥

తా॥ తృష్ణ నుండి శోకము కల్గును తృష్ణ నుండి భయము జనించును తృష్ణా విముక్తుడగు వానికి భయశోకము లెక్కడివి? 216

స్థానము - రాజగృహము వ్యక్తి - పంచశత దారకుడు

శ్లో॥ శీల దస్సన సమ్పన్నం, ధమ్మట్ఠం సచ్చ వాదినం ।
అత్తనో కమ్మ కుబ్బానం, తం జనో కురుతే పియం ॥

తా॥ శీల వంతులు, సమ్యక్ దర్శన సంపన్నులు, ధార్మికులు సత్యవాదులు ఇతరుల జోలికి పోనివారు జనులకు ప్రియులగుదురు

స్థానము :- జేతవనము వ్యక్తి :- అనాగామి థేరుడు:

శ్లో॥ ఛందజాతో అనక్ఖాతే, మనసాచ ఫుటోసియా ।
కామేసు చ అప్పటి బద్ధ చిత్తో, ఉద్ధం సోతోఽతి వుచ్చతి ॥

తా॥ నిర్వాణము నందు ఇచ్ఛగలవారు, నిర్మల మనస్కులు, కామవాసనలచే బంధితులు కాని వారిని ఊర్ధ్వస్రోతులందురు 218

స్థానము - ఋషిపతనము వ్యక్తి - నంది పుత్రుడు

శ్లో॥ చిరప్పవాసిం, పురసిం దూరతో సోత్థి మాగతం ।
ఞాతి మిత్తా సుహుజ్జాచ, అభినన్దన్తి ఆగతం ॥

తా॥ చాలా కాలము దేశాంతరమునకు పోయి ఇంటికి తిరిగి వచ్చిన వ్యక్తిని బంధు మిత్రులు, సహృదయులు ఎదురేగి అభినందింతురు 219

శ్లో॥ తథేవ కత పుఞ్ఞంపి, అస్మాలోకా పరం గతం ।
పుఞ్ఞాని పటి గణహన్తి, పియం ఞాతీవ అగతం ॥12॥

తా॥ అటులే ఈ లోకము నుండి పరలోకమునకు పోవు పుణ్యాత్ముని, బంధు మిత్రులవలె అతని పుణ్యకర్మ స్వాగతించును 220

12)

———

# క్రోధవగ్గో సత్తరసమో

## క్రోధవర్గము . పదిహేడవ అధ్యాయము

స్థానము - న్యగ్రోధారామము వ్యక్తి - రోహిణిక్షత్రియ కన్య

శ్లో॥ కోధం జహే విప్పహేయ్య మానం, సంయోజనం సబ్బ
మతిక్కమేయ్యం
తం నామరూపస్మిం అసజ్జమానం, అకించనం నాను
పతన్తి దుక్ఖా ॥

తా॥ క్రోధమును వీడువ వలెను అభిమానమును విడువ వలెను సర్వ బంధములను అతిక్రమించ వలెను నామ రూపము లందు అనాసక్తుడగు అట్టి అకించనునికి దుఃఖము కలుగదు 221

స్థానము - అగ్గాలవ చైత్యము వ్యక్తి - అజ్ఞతర భిక్షు

శ్లో॥ యోవే ఉప్పతితం కోధం, రథభన్తం వ ధారయే ।
తమహం సారథిం బ్రూమి, రస్మిగ్గాహో ఇతరో జనో ॥

తా॥ పెల్లుబికి వచ్చు కోపమును, నిలిపివేయ బడిన రథము వలె ఎవడు నిగ్రహించునో వానిని నేను సారథి అందును ఇతరులు కేవలము పగ్గములు పట్టుకొనెడి వారే 222

స్థానము - రాజగృహము వ్యక్తి - ఉత్తర ఉపాసిక

శ్లో॥ అక్కోధేన జినే కోధం, అసాధుం సాధునా జినే ।
జినే కదారియం దానేన, సచ్చేనాలీక వాదినం ॥

తా॥ శాంతితో క్రోధమును జయించ వలెను సాధుత్వముతో క్రూరత్వమును జయించ వలెను దానముతో లోభత్వమును, సత్యముతో అసత్యమును జయించ వలెను 223

స్థానము - జేతవనము వ్యక్తి - మహామౌద్గల్యాయన థేరుడు

శ్లో॥ సచ్చం భణేన కుజ్ఝెయ్య, దజ్జా అప్పంపి యాచితో ।
ఎతేహి తీహి ఠానేహి, గచ్ఛే దేవాన సన్తికే ॥

తా॥ సత్యమును చెప్పుము క్రోధమును రానీయకుము అడిగి నపుడు కొంచెమైనను ఇమ్ము ఈమూడిటి వలన దేవతల సాన్నిధ్యమును పొంద గలవు 224

స్థానము - అంజన వనము వ్యక్తి - —

శ్లో అహింసకా యో మునయో, నిచ్చం కాయేన సంవుతా ।
తే యన్తి అచ్చుతం ఠానం, యత్థ గన్త్వా న సోచరే ॥

తా॥ అహింసకుడును,సదా శరీరమును అధీనములో నుంచు కొను వాడు నగు వ్యక్తి చ్యుతి లేని స్థానమున్ను పొంది దుఃఖ రహితుడై యుండును, 225

స్థానము - గృధ్రకూట పర్వతము వ్యక్తి - దాసిపుణ్ణ

శ్లో॥ సదా జాగరమానాయ, అహోరత్తాను సిక్ఖనం ।
నిబ్బానం అధిముత్తానం, అత్థం గచ్ఛన్తి ఆసవా ॥

తా॥ సదా జాగృతులై యుండు వారు, రాత్రింబవళ్ళు శిక్షితులగు వారు మరియు నిర్వాణప్రాప్తికై యత్నించు వారునగు వ్యక్తుల యొక్క చిత్త మలములు నశించును 226

స్థానము - జేతవనము వ్యక్తి - అతుల ఉపాసకుడు

శ్లో॥ పోరణమేతం అతుల, నేతం అజ్జతనామివ ।
నిన్దన్తి తుణ్హిమాసీనం, నిన్దన్తి బహు భాణినం ।
మితభాణిం పిం నిన్దన్తి, నాత్థి లోకే అనిన్దతో ॥

తా॥ ఓ అతులా ! ఇది నేడే కాదు, పూర్వము నుండియు ఉన్నదే! ప్రజలు మౌనముగా నుండు వానిని నిందింతురు అతి భాషిని నిందింతురు మితభాషిని కూడా నిందింతురు యీ లోకమున నిందింప బడని వ్యక్తులే లేరు 227

శ్లో॥ న చాహు న చ భవిస్సతి, న చేతరహి విజ్జతి ।
ఎకంతం నిందితో పోసో, ఎకంతం వా పసంసి తో ॥

తా॥ పూర్తిగా నిందితులు గాని, పూర్తిగా ప్రశంసితులు గాని యీ లోకమున ఇంతకు ముందు లేరు ఇక ముందు ఉండ జాలరు నేడు కన్పింపరు 228

శ్లో॥ యం చే విఞ్ఞూ పసంసన్తి, అనువిచ్చ సువే సువే ।
అచ్ఛిదదవృత్తిం మేధావిం, పఞ్ఞాసీల సమాహితం ॥

శ్లో॥ నిక్ఖా ఱంబోన దస్సేన, కోతం నిందితు మర్హతి ।
దేవా పి తుం పసంసన్తి, బ్రహ్మునునాపి పసంసితో ॥

తా॥ నిర్దోషమగు ఆచరణ కలవాడును, మేధావియు, ప్రాజ్ఞుడును, శీలవంతుడునగు వ్యక్తిని విజ్ఞులు ప్రశంసింతురు సువర్ణనాణెము వలె నిష్కళంకుడగు అట్టి వ్యక్తిని ఎవరు నిందింతురు! అతనిని దేవతలు మరియు బ్రహ్మకూడా ప్రశంసింతురు 229

స్థానము - వేణువనము వ్యక్తి - షడ్వర్గీయ భిక్షు

శ్లో॥ కాయప్పకోపం రక్ఖెయ్య, కాయేన సంవుతోసియా ।
కాయ దుచ్చరితంహిత్వా, కాయేన సుచరిత చరే ॥

తా॥ శరీరమును క్రోధము నుండి రక్షింపుము శరీరమును అధీనములో ఉంచుకొనుము శారీరక దుశ్చర్యలను త్యజించి సదాచారమునే పాటింపుము 230

శ్లో॥ వచీపకోపం రక్ఖెయ్య, వాచాయ సంవుతో సియా ।
వచీ దుశ్చరితం హిత్వా, వాచాయ సుచరితం చరే ॥

తా॥ నీ మాటలలో క్రోధమును రానీయకుము వచో నిగ్రహము కలిగియుండుము వాచసిక దురాచరమును త్యజించి సదాచారమునే అనుసరింపుము 231

శ్లో॥ మనోపకోపం రక్ఖేయ్య, మనసాసంవుతో సియా ।
మనో దుశ్చరితం హిత్వా, మనసా సుచరితం చరే ॥

తా॥ మనస్సులో క్రోధమును ప్రవేశింపనీయకుము మనో నిగ్రహమును కలిగియుండుము మానసిక దుశ్చర్యలను వదలి సదాచారమునే అనుసరింపుము 232

శ్లో॥ కాయేన సంవుతా ధీరా, అథోవాచాయ సంవుతా ।
మనసా సంవుతాధీరా, తే వే సుపరిసంవుతా ॥ 14

తా॥ ధీరులు మనోవాక్కాయముల ద్వారా సంయతులై యుందురు వాస్తవమున అట్టి వారే సుసంయుతులు 234

# మల్లవగ్గో అట్ఠరసమో

## మల్ల వర్గము - పదునెనిమిదవ అధ్యాయము

స్థానము - జేతవనము వ్యక్తి - గోఘాతక పుత్రుడు

శ్లో॥ పండూ పలాసో వ దానిసి, యమపురిసా పిచతం ఉపట్ఠితా ।
ఉయ్యోగ ముఖేచ నిట్ఠసి, పాథేయ్యం పిచతే నవిజ్జతి ॥

తా॥ ఇప్పుడు నీవు రాలిపోవుటకు సిద్ధముగా నున్న పండుటాకు వలె నున్నావు నీ వద్దకు యమదూతలు కూడా చేరియున్నారు మృత్యు ముఖమున నిలిచి యున్నప్పటికిని నీ వద్ద కుశల కర్మలను దారి బత్తెము లేదు 235

శ్లో సో కరోహి దీపమత్తనో, ఖిప్పం వా యమ పణ్డితో భవ ।
నిద్ధంతమలో అనఙ్గణో, దిబ్బం అరియభూమిం ఉపేహసి॥

తా॥ అందు వలన యీ సంసార రూప సాగర మధ్యమున నీ రక్షణకై ఒక ద్వీపమును నిర్మించు కొనుము శీఘ్రముగా ప్రయత్నింపుము పండితుడవు, మలరహితుడవు, నిష్కళంకుడవు కమ్ము । ఇట్లు చేయుట వలన తిరిగి జనన మరణముల నొందక దివ్యమగు ఆర్యభూమికలను చేరగలవు 236

శ్లో॥ ఉపనీత వయో చ దానిసి, సమ్పయాతోసి యమస్స సన్తికె
వాసో తే నాత్థి అన్తరా, పాథెయ్యం పి చతే న విజ్జతి ॥

తా॥ నీ ఆయువు గడిచి పోయినది యమరాజును సమీపించుచున్నావు మధ్యలో నీ యిల్లు లేదు నీ వద్ద దారి బత్తెము కూడా లేదు 237

శ్లో॥ సో కరోహి దీపమత్తనో, ఖిప్పం వాయమ పణ్డితో భవ ।
నిద్ధంతమలో అనఙ్గణో, న పున జాతి జరం ఉపేహసి ॥

తా॥ అందువలన నీ రక్షణ కొరకై ద్వీపమును నిర్మించుకొనుము శీఘ్ర ప్రయత్నమొనరించుము పండితుడవు, మలరహితుడవు, నిష్కళంకుడవు గమ్ము ? అట్లు చేయుట వలన తిరిగి జనన మరణములను పొందవు 238

స్థానము - జేతవనము వ్యక్తి - అజ్ఞతర బ్రాహ్మణుడు

శ్లో॥ అనుపుబ్బేన మేధావీ, థోకథోకం ఖణే ఖణే ।
కమ్మారో రజతస్సేవ, నిద్ధమే మల మత్తనో ॥

తా॥ కంసాలి వెండి యొక్క మలినమును క్రమముగా తగ్గించి నష్టమొనరించు నట్లు, బుద్ధి మంతుడు క్రమముగా తన మలినములను నశింపజేయ వలెను. 239

స్థానము - జేతవనము వ్యక్తి - తిష్యథేరుడు

శ్లో॥ అయసావ మలం సముట్ఠితం, తదుట్ఠాయ తమేవ ఖాదతి ।
ఎవం అతిథోన చారిణం సాని కమ్మాని నయన్తి దుగ్గతిం ॥

తా॥ ఇనుము నుండి పుట్టిన త్రుప్పు ఇనుమునే తినివేయు నట్లు, పవిత్రాచరణను అతిక్రమించిన వానిని వాని కర్మలే దుర్గతికి కొనిపోవును 240

స్థానము - జేతవనము వ్యక్తి - లాలూదాయి థేరుడు

శ్లో॥ అసజ్ఝాయ మలా మన్తా, అనుట్ఠాన మలా ఘరా ।
మలం వణ్ణస్స కోసజ్జం, పమాదో రక్ఖతో మలం ॥

తా॥ స్వాధ్యాయము చేయకుండుట మంత్రముల మలినము మరమ్మత్తులు చేయకుండుట ఇళ్ళ యొక్క మలినము సోమరి తనము అందము యొక్క మలినము అజాగ్రత్త రక్షక భటుని మలినము 241

స్థానము - రాజగృహము వ్యక్తి - అఞ్ఞతర కులపుత్రుడు

శ్లో॥ మలిత్థియా దుశ్చరితం, మచ్ఛేరం దదతో మలం ।
మలావే పాపకా ధమ్మా, అస్మింలోకే పరమ్హి చ ॥
తతో మలామలతరం, అవిజ్జా పరమం మలం ।
ఎతం మలం పహత్వాన, నిమ్మలా హోథ భిక్ఖవో ॥

తా॥ దురాచరణము స్త్రీ యొక్క మలినము కాఠిన్యము దాత యొక్క మలినము, పాపకర్మలు ఇహ-పరము లందును మలినము ఆ మలినము లన్నిటి కన్న అధిక మలినము అవిద్య యీ మలినమును త్యజించి ఓ భిక్షువులారా । నిర్మలులు కండి । 242-43

స్థానము - జేతవనము వ్యక్తి - చుల్లసారి

శ్లో॥ సుజీవం అహిరికేన, కాకాసూరేన ధంసినా ।
పక్ఖందినా పగబ్భేన, సంకిలిట్ఠేన జీవితం ॥

తా॥ లజ్జారహితుడు, కాకివలె స్వార్థముతో శూరుడు పరులకు చెరుపు చేయువాడు, పతితుడు మరియు పాపియగు వాడు జీవించుట చాలా సులభము 244

శ్లో॥ హిరీమతాచ దుజ్జీవం, నిచ్చం సుచిగవేసినా ।
అలీనేనాప్పగబ్భేన, సుద్ధాజీవేన పస్సతా ॥

తా॥ లజ్జావంతుడు, పవిత్రతాన్వేషకుడు, అప్రగల్భుడు, శుద్ధుడునగు జ్ఞాని జీవించుట చాలా కఠినము 242

స్థానము - జేతవనము వ్యక్తి - పంచ శత ఉపాసకుడు

శ్లో॥ యో పాణమతి పాతేతి, ముసావాదంచ భాసతి ।
లోకే అదిన్న మాదియతి, పర దారంచ గచ్ఛతి ॥

శ్లో॥ సురామేరయ పానం చ, యోనరో అణుయుఞ్జతి।
ఇధేవమేసో లోకస్మిం, మూలంఖణతి అత్తనో ॥

తా॥ ప్రాణుల వధించువాడు, అబద్ధము లాడువాడు, పరస్త్రీని పొందువాడు దొంగతనము చేయు వాడు, సురాపానము చేయువాడు యీ లోకములో తన గోతిని తానే త్రవ్వుకొను చున్నాడు 247-48

శ్లో॥ ఎవం భో పురిస జానాహి, పాపధమ్మా అసఞ్ఞతా।
మాతం లోభో అధమ్మో చ, చిరం దుక్ఖాయ రంధయుం ॥

తా॥ ఓ పురుషా! నిగ్రహ రహితుడు, యీ విధముగా పాపము చేయువాడగును దీనిని తెలిసికొమ్ము! లోభము, అధర్మము నిన్ను దుఃఖములో ఎక్కువ కాలము దహింప కుందు గాక! 248

స్థానము - జేతవనము వ్యక్తి - తిష్య దహరుడు

శ్లో॥ దదాతి వే యథా సద్ధం, యథా పసాదనం జనో।
తత్థ యోమఙ్కు భవతి, పరేసం పానభోజనం ॥

తా॥ మనుష్యులు తను శ్రద్ధా ప్రసన్నతానుసారము దానము చేయుదురు ఇతరుల భోజన పానీయములందు శ్రద్ధవహించని వానికి దివా-రాత్రము లందును శాంతి లభింపదు. 249

శ్లో॥ యస్య చేతం సముఛ్ఛిన్నం, మూలఘచ్ఛం సమూహతం।
సవే దివావ రత్తింవా, సమాధి మధిగఛ్ఛతి ॥

తా॥ నశింప జేయవలసిన దుర్విచారముల యొక్క మూలము ఎవనిలో పెకలింప బడినదో, వారు దివా-రాత్రముుందును శాంతిని పొందుదురు 250

స్థానము - జేతవనము వ్యక్తి - పంచ ఉపాసకుడు

శ్లో॥ నాత్థిరాగసమో అగ్నిౖ, నాత్థిదోస సమో గహో ।
నాత్థిమోహ సమంజలం, నాత్థి తణ్హా సమానదీ ॥

తా॥ రాగము వంటి అగ్నిలేదు, ద్వేషము వంటి మొసలి లేదు మోహము వంటి జలము లేదు తృష్ణ వంటి నదిలేదు 251

స్థానము - భద్దియనగరము వ్యక్తి - మేండకి శ్రేష్ఠి

శ్లో॥ సుదస్సం వజ్జమఞ్ఞేసం, అత్తనో పనదుద్దసం ।
పరేసం హి సో వజ్జాని, ఒపునాతి యథాభుసం ॥

తా॥ ఇతరుల లోపములను గమనించుట సులభము కాని తన దోషములను గమనించుట కఠినము పరుల దోషములను కస్ర ఘొడివలె వ్యాపింప జేతురు తమ దోషముుసు మాత్రము లోభి వస్త్రమును దాచి నట్లు దాచికొందురు. 252

స్థానము - జేతవనము వ్యక్తి - ఉజ్ఝానసఞ్ఞి థేరుడు

శ్లో॥ పరవజ్జాను పస్సిస్స, నిచ్చం ఉజ్ఝాను సఞ్ఞినో ।
ఆసవా తస్స వడ్ఢంతి, ఆరసో ఆసవక్ఖయా ॥

తా॥ ఇతరుల దోషముల గమనించు వారికి మరియు చెడు విచారములు చేయు వారికి చిత్తమలములు పెరుగును చిత్తదోష వినాశనము వారికి బహుదూరము 253

స్థానము - కుశీనారము వ్యక్తి - సుభద్రపరివ్రాజకుడు

శ్లో॥ ఆకాసేవ పదం నాత్థి, సమణో నాత్థి బాహిరే ।
పపఞ్చాభిరతాపజా, నిప్పపఞ్చాతథాగతా ॥

తా॥ ఆకాశమున త్రోవ లేనట్లే బౌద్ధ సంఘమున కావల శ్రమణుడు లేడు ప్రజలు ప్రపంచము నందానందింతురు బుద్ధుడు లోకాతీతుడు 254

శ్లో॥ ఆకాసేవ పదం నాత్థి, సమణో నాత్థి బాహిరే ।
సంఖార సస్సతా నాత్థి, నాత్థి బుద్ధాన మిఞ్జితం ॥ 12

తా॥ ఆకాశమున త్రోవ లేనట్లే, బౌద్ధ సంఘమున కావల శ్రమణుడు లేడు సంస్కారములు శాశ్వతములు కావు బుద్ధునిలో అస్థిరత ఉండదు 255

# ధమ్మట్ఠవగ్గో ఎకునవీసతిమో

## ధర్మస్థ వర్గము - పందొమ్మిదవ అధ్యాయము.

స్థానము - జేతవనము  వ్యక్తి - వినిశ్చయ మహామాత్యుడు

శ్లో॥ న తేన హోతి ధమ్మట్ఠో, యేనత్థం సాహసానయే ।
యో చ అత్థ అనత్థంచ, ఉభోనిచ్ఛెయ్య పండితో ॥

తా॥ క్రూరత్వముతో అర్థమును (వాస్తవికతను) ముందుంచు తెల్పువాడు ధర్మాత్ముడు కాడు ఎవడు అర్థానర్థములను నిశ్చయిం చునో వాడే పండితుడు  256

శ్లో॥ అసాహసేన ధమ్మేన, సమేన నయతీ పరే ।
ధమ్మస్స గుత్తో మేధావీ, ధమ్మట్ఠో తి పవుచ్చతి ॥

తా॥ దుస్సాహసమును వదలి సమాన భావముతో ఇతరులను కూడా సన్మార్గమున నడిపించు వాడే ధర్మ రక్షకుడు, మేధావి, మరియు ధర్మస్థుడు కూడా  257

స్థానము - జేతవనము  వ్యక్తి - షడ్వర్గీయ భిక్షు

శ్లో॥ న తేన పణ్డితో హోతి । యావతా బహు భాసతి ।
ఖేమి అవేరి అభయో, పణ్డితోతి పవుచ్చతి ॥

తా॥ ఎక్కువగా మాట్లాడినంతనే ఒక వ్యక్తి పండితు డన బడ జాలడు అందరి క్షేమము నందు ఆసక్తి కలవాడు, వైరము లేనివాడు, నిర్భయుడునగు వాడే పండితుడన బడును 258

స్థానము - జేతవనము వ్యక్తి - ఎకధాన థేరుడు

శ్లో॥ న తావతా ధమ్మధరో, యావతా బహు భాసతి ।
యో చ అప్పం పి సుత్వాన, ధమ్మం కాయేన పస్సతి ।
సవే ధమ్మధరో హోతి, యోధమ్మం నప్పమజ్జతి ॥

తా॥ ఎక్కువగా మాట్లాడినంతనే ఒక వ్యక్తి ధర్మ ధరుడని పిలువ బడజాలడు కొంచెమే విన్నప్పటికీ, ఆ విన్న దానిని శరీర ముతో ఆచరించువాడుతో, ధర్మ విషయమున పొరపాటుచేయని వాడే ధర్మధరుడు 259

స్థానము - జేతవనము వ్యక్తి - లకుణ్టక భద్దియ థేరుడు

శ్లో॥ న తేన థేరో సో హోతి, యేనస్స పలితం సిరో ।
పరిపక్కో వయోతస్స, మోఘ జిణ్ణో తి వుచ్చతి ॥

తా॥ వృద్ధాప్యము వలన ఒకని శిరస్సు తెల్లబడి నంతనే వాడు థేరుడు కాజాలడు వాని ఆయువు పరిపక్వమైనను వ్యర్థము గనే వృద్ధుడని పిలువ బడును. 260

శ్లో॥ యమ్హి సచ్చం చ ధమ్మోచ, అహింసా సంయమోదమో ।
సవే వన్తమలో ధీరో, థేరో ఇతి పవుచ్చతి ॥

తా॥ ఎవనిలో సత్యము, ధర్మము, అహింస, శమదమములు న్నవో అట్టి మలరహితుడగు ధీరుడే థేరుడు (వృద్ధుడు) అనబడును

స్థానము - జేతవనము వ్యక్తి - సంబాహుల భిక్షు

శ్లో॥ న వాక్కరణ మత్తేన, వణ్ణపోక్ఖరతాయ వా ।
సాధురూపో నరో హోతి, ఇస్సుకీ మచ్ఛరీ సఠో ॥

తా॥ ఈర్ష్యాళువు, మత్సర గ్రస్తుడు, శఠుడు నగు వాడు నేర్పుగా మాట్లాడి నంతనే, చక్కని రంగు కలిగినంతనే సాధువు కాజాలడు 262

శ్లో॥ యస్స చేతం సముచ్ఛిన్నం, మూలఘచ్ఛం సమూహతం।
స వన్తదోషో మేధావీ, సాధు రూపో 'తి' వుచ్చతి ॥

తా॥ ఎవనిలో యీ దోషములు సమూలముగా నశించినవో దోషరహితుడగు అట్టి మేధావియే సాధువు అనబడును 263

స్థానము - శ్రావస్తి వ్యక్తి - హత్థక భిక్షు

శ్లో॥ న ముణ్డకేన సమణో, అబ్బతో అలికం భణం ।
ఇచ్ఛాలోభ సమాపన్నో, సమణో కిం భవిస్సతి ।

తా॥ వ్రతరహితుడు, అసత్యవాదియునగు వ్యక్తి తలగొరి గించు కున్నంతనే శ్రమణుడు కాజాలడు ఇచ్ఛాలోభ యుక్తుడగు నరుడు శ్రమణుడెట్లగును ? 264

శ్లో॥ యో చ సమేతి పాపాని, అణుం థూలాని సబ్బసో ।
సమితత్తాహి పాపానం, సమణోతి పవుచ్చతి ॥

తా॥ చిన్నవి మరియు పెద్దవియునగు పాపములను ఎప్పటి కప్పుడు శమింప జేయు వాడు, పాప శమన కారణమున శ్రమణు డనబడును 265

స్థానము - జేతవనము వ్యక్తి - అజ్ఞతరబ్రాహ్మణుడు

శ్లో॥ న తేన భిక్ఖు సో హోతి, యావతా భిక్ఖతే పరే ।
విస్సం ధమ్మం సమాదాయ, భిక్ఖూ హోతి న తావతా ॥

తా॥ కేవలము ఇతురుల యాచించి నంతనే ఒకడు భిక్షువు కాజాలడు సమస్త ధర్మముల గ్రహించియు నరుడు భిక్షువు కాలేడు

శ్లో॥ యోధ పుఞ్ఞంచ పాపంచ, బాహేత్వా బ్రహ్మచారివా ।
సంఖాయలోకే చరతి, సవే భిక్ఖూం తి వుచ్చతి ॥

తా॥ ఎవడిక్కడ పుణ్యపాపముల విసర్జించి, బ్రహ్మచారియై లోకమునజ్ఞాన పూర్వకముగా చరింపనోవాడే భిక్షు వన బడును267

స్థానము - జేతవనము వ్యక్తి - తిర్థియుడు

శ్లో॥ న మోనేన మునీహోతి, మూల్హరూపో అవిద్దసు ।
యో చ తులం వ పగ్గయ్హ, వరమాదాయ పణ్డితో ॥

తా॥ మూర్ఖుడు, అవిద్వాంసుడునగువాడు మౌనము వహించినంతనే ముని కాజాలడు త్రాసువలె మంచి చెడులను తూచి, మంచిని గ్రహించువాడే పండితు డనబడును 268

శ్లో॥ పాపాని పరివజ్జేతి, సమునీ తేన సోమునీ ।
యోమునాతి ఉభోలోకే, మునితే న పవుచ్చతి॥

తా॥ పాపమును పరిత్యజించిన వాడు ఆ కారణము చేతనే మునియనబడును ఎవడీ లోకమున పాపపుణ్య విచారణ కలిగి యుండునో వాడే ముని యనబడును 269

స్థానము - జేతవనము వ్యక్తి - ఆర్యబాలిసిక

శ్లో॥ న తేన అరియో హోతి, యేన పాణాని హింసతి ।
అహింసా సబ్బపాణానం, అరియోతి పవుచ్చతి ॥

తా॥ ప్రాణి హింస చేయువాడు ఆర్యుడు కాజాలడు సర్వ ప్రాణుల పట్ల అహింసను పాటించువాడే ఆర్యుడనబడును 270

స్థానము - జేతవనము వ్యక్తి - సంబాహుల శీలాది భిక్షువు

శ్లో॥ న సీలబ్బత మత్తేన, బాహుసచ్చేన వా పన।
అథవా సమాధి లాభేన, వివిత్త సయనేనవా॥

శ్లో॥ ఫుసామి నేక్ఖమ్మ సుఖం, అపుథుజ్జన సేవితం।
భిక్ఖువిస్స సమాపాది, అప్పత్తో ఆసవక్ఖయం॥17॥

తా॥ కేవల శీలవ్రత ధారణ మాత్రమున కాని, ఎక్కువ చదవటం వలనగాని, సమాధి లాభమున గాని, ఏకాంత శయనమున గాని బుద్ధులనుభవించు నైష్కర్మ్య సుఖమును స్పృశింప జాలవు హే భిక్షూ! చిత్తమలములు నశింపనిదే అట్టి సుఖము లభింపనను ఆశ విడువుము 271,272

—*—

# మగ్గవగ్గో వీసతిమో

## మార్గ వర్గము ఇరువదియవ అధ్యాయము

స్థానము - జేతవనము వ్యక్తి - పంచశత భిక్షు

శ్లో॥ మగ్గాట్ఠఙ్గికో సెట్ఠో, సచ్చానం చతురో పదా ।
విరాగో సెట్ఠో ధమ్మానం, ద్విపదానంచ చక్ఖుమా ॥

తా॥ మార్గములలో అష్టాంగమార్గము శ్రేష్ఠమైనది సత్యములలో చతురార్య సత్యములు శ్రేష్ఠమైనవి మనుష్యులలో జ్ఞాని శ్రేష్ఠుడు 273

శ్లో॥ ఎసోవ మగ్గో నత్థఞ్ఞో, దస్సనస్స విసుద్ధియా ।
ఎతం హి తుమ్హే పటిపజ్జథ, మారస్సేసం పమోహనం ॥

తా॥ విశుద్ధ దర్శనమునకై ఇదియే ఏకైక మార్గము వేరు లేదు నీవు యీ మార్గమునే అనుసరింపుము ఇది మారుని మోహింప జేయ గలదు 274

శ్లో॥ ఎతం హి తుమ్హే పటిపన్నా, దుక్ఖస్సంతం కరిస్సథ ।
అక్ఖాతో వో మయా మగ్గో, అఞ్ఞాయ సల్ల సంథనం ॥

తా॥ నీవీ మార్గము ననుసరించినచో దుఃఖమును అంత మొందింప గలవు దుఃఖనాశనమును తెలిసిన నాద్వారా యీ మార్గము ప్రతిపాదింపబడినది 275

శ్లో॥ తుమ్హేహి కిచ్చమాత ప్తం, అక్ఖాతారో తథాగతా।
పటిపన్నా పమోక్ఖంతి, ఝాయినో మారబంధనా॥

తా॥ తపస్సు నీవే చేయవలెను తథాగతుడు ఉపదేష్ట మాత్రమే ఇంతకుముందు చెప్పబడిన మార్గము ననుసరించి ధ్యానశీలుడగువాడు మారుని బంధనముల నుండి ముక్తుడు కాగలడు 276

శ్లో॥ సబ్బే సంఖార అనిచ్చాతి, యదా పఞ్ఞాయ పస్సతి।
అథ నిబ్బిన్దతి దుక్ఖే, ఎసమగ్గో విసుద్ధియా॥

తా॥ సర్వ సంస్కారము లనిత్యములని ప్రజ్ఞతో గమనించి నప్పుడే దుఃఖవిముక్తి కలుగును ఇదియే విశుద్ధికి మార్గము 277

శ్లో॥ సబ్బే సంఖార దుక్ఖాతి యదా పఞ్ఞాయ పస్సతి।
అథనిబ్బిన్దతి దుక్ఖే, ఎసమగ్గో విసుద్ధియా॥

తా॥ సకల సంస్కారములు దుఃఖ మయములని ప్రజ్ఞతో గుర్తెరిగినప్పుడే దుఃఖవిముక్తి కలుగును, ఇదియే విశుద్ధికి మార్గము 278

శ్లో॥ సబ్బే ధమ్మా అనిచ్చాతి, యదా పఞ్ఞాయ పస్సతి ।
అథ నిబ్బిన్దతి దుక్ఖే, ఎసమగ్గో విసుద్ధియా ॥

తా॥ సర్వ ధర్మము లనిత్యములని, ప్రజ్ఞతో గమనించి నప్పుడే దుఃఖము తొలగి పోవును ఇదియే విశుద్ధికి మార్గము 279

స్థానము - జేతవనము వ్యక్తి ప్రధాన కర్మిక తిష్యథేరుడు

శ్లో॥ ఉట్ఠానకాలమ్హి అనుట్ఠహానో,
యువా బలీ ఆలసియం ఉపేతో ।
సంసన్న సంకప్పమనో కుసీతో ।
పఞ్ఞాయ మగ్గం అలసో న విన్దతి ॥

తా॥ యువకుడు బలవంతుడు అయి ఉండియు మేల్కొన వలసినపుడు మేల్కొనక సోమరియగువాడు, బలహీనమైన మన స్సంకల్పములు గలవాడు, దీర్ఘసూత్రి, ఆలసియగు వాడు ప్రజ్ఞా మార్గము ననుసరింప జాలడు 280

స్థానము - వేణువనము వ్యక్తి - సూకర ప్రేతు

శ్లో॥ వాచానురక్ఖీ మనసా సుసంవుతో,
కాయేన చ అకుసల న కాయిరా ।
ఎతే తయో కమ్మపథే విసోధయే,
ఆరాధయే మగ్గ మిసిప్పవేదితం ॥

తా॥ వాక్కును రక్షించు కొనువాడు, మనోనిగ్రహము కలవాడు, శరీరముచే అకుశల కర్మలు చేయని వాడు, యీ మూడు కర్మపథములను పరిశుభ్రముగా నుంచును అట్టివాడు పూజనీయులచే ప్రవర్తింపబడిన మార్గమును సేవించును 281

స్థానము - జేతవనము వ్యక్తి - పోఠిల థేరుడు

శ్లో॥ యోగా వే జాయతి భూరి, అయోగా భూరి సంఖయో।
ఎతం ద్వేధ పథం క్రిత్వా,భవాయ విభవాయచ॥

తా॥ యోగము వలన అగాధమగు జ్ఞానము ఉత్పన్నమగును యోగాచరణ లేనిచో జ్ఞానము నశించును వృద్ధి క్షయముల కల్గించు యీ ద్వివిధ భిన్న మార్గముల తెలిసి మానవుడు జ్ఞానాభివృద్ధి యగు మార్గము ననుసరింపవలెను 282

స్థానము - జేతవనము వ్యక్తి సంబాహుల భిక్షు

శ్లో॥ యావహి వమథో న చిజ్జతి, అణుమత్తోపి నరస్స నారిసు।
పటి బద్ధ మనో తావసో, వచ్ఛో ఖీర పకో వ మాతరి॥

తా॥ నరునకు స్త్రీ పట్ల లేశమాత్ర సంభోగేచ్ఛ యున్నను పాలు త్రాగు బాలుడు తల్లిపట్ల బద్ధుడై యున్నట్లు స్త్రీ గత మనస్కుడై యుండును 283

శ్లో॥ వనం చిదథ మా రుక్ఖం, వనతో జాయతే భయం।
ఛేత్వా వనంచ వనంథంచ, నిబ్బనా హోథ భిక్ఖవో॥

తా॥ వాసనలను అడవిని నరికి వేయండి ! వృక్షమునను కాదు! వనము (కామేచ్ఛ) వలన భయము కల్గును వనమును మరియు వృక్షములను నరికివేసి ఓ భిక్షువులారా ? వనరహితులు (వాసనా శూన్యులు) కండి ! 284

స్థానము - జేతవనము వ్యక్తి - సువర్ణకారపుత్ర థేరుడు

శ్లో॥ ఉచ్ఛిన్ద సినేహమత్తనో, కుముద సారదికం వ పాణినా ।
సన్తిమగ్గమేవ బ్రూహయ, నిబ్బానం సుగతేన దేసితం ॥

తా॥ శరత్కాలము నందలి కలువ పుష్పమును చేయితో పెరికి వేసినట్లుగా ఆత్మస్నేహమును (అహంభావమును) పెరికి వేయుము సుగత బుద్ధునిచే ఉపదేశింప బడిన శాంతి మార్గ నిర్వాణమునే పెంపొందించుము 285

స్థానము - జేతవనము వ్యక్తి - మహాధన వణిజుడు

శ్లో॥ ఇధ వస్సం వసిస్సామి, ఇధ హేమన్త గిమ్హిసు ।
ఇతి బాలో విచింతేతి, అంతరాయ న బుజ్ఝతి ॥

తా॥ "ఇచట వర్షరుతువు గడుపుదును ఇచట హేమంత గ్రీష్మములు గడుపుదు నని మూర్ఖుడు ఆలోచించును కాని మృత్యు వెప్పుడు కబళించునో వానికేమి తెలియును ? 286

స్థానము - జేతవనము వ్యక్తి - కిసగౌతమి థేరి

శ్లో॥ తం పుత్త పసు సంమత్త, వ్యాసత్త మనసం నరం।
సుత్తం గామ మహోఘోవ, మచ్చు ఆదాయ గచ్ఛతి ॥

తా॥ పుత్రులు, పశువులయందు నిమగ్నులై వాటియందే ఆసక్తి గల మనుజులను, నిద్రితగ్రామమును ప్రవాహము కొని పోవునట్లు మృత్యువు తీసికొని పోవును 287

స్థానము - జేతవనము వ్యక్తి - పటాచార థేరి

శ్లో॥ న సన్తి పుత్తా తాణాయ, న పితా నపి బాంధవా ।
అన్తకేనాధి పన్నస్స నాత్థి ఞాతీసు తాణతా ॥

తా॥ మృత్యుగ్రస్తుడైన మానవుని పుత్రుడుగాని, తండ్రిగాని, బంధువులు గాని రక్షింప లేరు వంశీకులతో కూడా రక్షణ సాధ్యము గాదు 288

శ్లో॥ ఎతమత్థవసం ఞత్వా, పణ్డితో సీల సంవుతో ।
నిబ్బాన గమనం మగ్గం, ఖిప్పమేవ విసోధయే ॥ 17

తా॥ ఈ విషయమును చక్కగా గుర్తెరింగి పండితుడు, శీలవంతుడు నగు మనుష్యుడు శీఘ్రమే నిర్వాణ మార్గమును శుభ్రము చేయవలెను 289

# పాకిణ్ణకవగ్గో ఎకవీసతిమో

## ప్రకీర్ణక వర్గము - ఇరువది యొకటవ అధ్యాయము

స్థానము - వేణువనము

శ్లో॥ మత్తా సుఖ పరిచ్చాగా, పస్సే చే విపులం సుఖం।
చజే మత్తా సుఖం ధీరో, సమ్పస్సం విపులం సుఖం॥

తా॥ అల్పసుఖ పరిత్యాగము వలన అధిక సుఖము లభించు నేని ధీరుడు ఆ అధిక సుఖము కొరకు అల్పసుఖమును పరిత్యజింప వలెను (లౌకిక సుఖము అల్పమైనది, నిర్వాణము అధికమైనది) 290

స్థానము - జేతవనము వ్యక్తి - కుక్కుట అండఖాది

శ్లో॥ పరదుక్ఖూపధానేన, అత్తనో సుఖమిచ్ఛతి।
వేరస సగ్గస సట్ఠో, వేరా సో న పరిముచ్చతి॥

తా॥ పరులకు దుఃఖమును కల్గించుచూ తన సుఖమును వాంఛించువాడు వైర సంసర్గమున నిమగ్నుడౌట వలన వైర భావము నుండి తప్పించుకోలేడు 291

స్థానము - జాతియావనము భద్దియ భిక్షు

శ్లో॥ యం హి కిచ్చం అపవిద్ధం, అకిచ్చం పనకయిరతి।
ఉన్నళానం పమత్తానం, తేసం వడ్ఢంతి ఆసవా॥

తా॥ మూర్ఖుడు చేయ వలసిన దానిని చేయక చేయగూడని దానిని చేయును మలినయుతులు, ప్రమత్తులునగు ఇట్టివారె[1] ఆస్ర వములు పెరుగుచూనే ఉండును 292

శ్లో॥ యేసం చ సుసమారద్ధా, నిచ్చం కాయ గతా సతి ।
అకిచ్చం తే న సేవన్తి, కిచ్చే సాతచ్చ కారినో ॥
సతానం సమ్పజానానం, అత్థ గచ్ఛన్తి ఆసవా ॥

తా॥ ఎవ్వరు చక్కగా కాయము నందు కాయాను పశ్యకులై యుందురో (శరీరమును నానామల సంపూర్ణముగా యథార్థముగా స్మృతి కలిగి యుందురో) అట్టివారు చేయవలసిన పనిని చేయుచూ చేయగూడని దానిని పరిత్యజింతురు స్మృతి మంతులు సంప్రజ్ఞాయుక్తులునగు అట్టివారె చిత్తమలములు క్షీణించును 293

స్థానము - జేతవనము వ్యక్తి - లకుణ్టక భద్దియ థేరుడు

శ్లో॥ మాతరం పితరం హన్త్వా, రాజానో ద్వేచ ఖత్తియె ॥
రట్ఠం సానుచర హన్త్వా, అనీఘో యాతి బ్రాహ్మణో ॥

తా॥ తలి దండ్రులను చంపి, ఇరువురు క్షత్రియ రాజులను, అనుచర సహితముగా రాష్ట్రమును నష్టమొనరించియు బ్రాహ్మణుడు పాపరహితుడగును 294

---

1 1) కామము 2) భవము 3) అవిద్య

తల్లి=తృష్ణ, తండ్రి=అహంకారము
ఇరువురు క్షత్రియరాజులు=శాశ్వత దృష్టి, ఉచ్ఛేద దృష్టి

రాష్ట్రము - పన్నెండు ఆయతనములు 1)చెవి 2) చర్మము 3) కన్ను 4) నాలుక 5) ముక్కు 6) మనస్సు ఇవి అంతరాయతనములు 7) శబ్దము 8) స్పర్శము 9) రూపము 10) రసనము 11) గంధము 12) ధర్మము ఇవి బాహ్య ఆయతనములు

శ్లో॥ మాతరం పితరం హన్త్వా రాజానోద్దేచ సేత్తిమో ।
వెయ్యగ్ఘ పంచమం హన్త్వా, అనీఘో యాతి బ్రాహ్మణో ॥

తా॥ మాతాపితరులను, ఇరువురు క్షత్రియ రాజులను అయిదు వ్యాఘ్రముల (పెద్దపులుల) ను చంపియు బ్రాహ్మణుడు పాపరహితుడగును 295

అయిదు వ్యాఘ్రములు - సంధ్యాసమయములో అరణ్యమున వృక్షాదులు కూడా పెద్దపులుల వలె భ్రాంతిని కల్గించును అందు వలన బౌద్ధ శాస్త్రములందు సంశయములను వెయ్యగ్ఘములందురు ఇవి 1) కామచ్ఛందము 2)వ్యాపాదము (ద్రోహము) 3) ఆలస్యము (సోమరి తనము) 4) ఔద్ధత్యము (గర్వము) 5) విచికిత్స (సంశయము) యీ పంచనీ వరణములలో విచికిత్స చివరిది అందు వలన పై అయిదు నీ వరణములను ఇటు పంచ వ్యాఘ్రములని పేర్కొనిరి,

స్థానము - జేతవనము వ్యక్తి - దారుసాకటి కస్యపుత్రుడు

శ్లో॥ సుప్పబుద్ధం పబుజ్ఝన్తి, సదాగోతను సావకా।
యేసం దివా చ రత్తోచ, నిచ్చం బుద్ధ గతాసతి॥

తా॥ ఎవని చిత్తము దివారాత్రములు బుద్ధ విషయకమై యుండునో గౌతముని శిష్యుడగు వాడు ప్రబుద్ధుడై బుద్ధుడగును

శ్లో॥ సుప్పబుద్ధం పబుజ్ఝన్తి, సదా గోతమ సావకా।
యేసం దివాచ రత్తోచ, నిచ్చంధమ్మగతా సతి॥

తా॥ ఎవని స్మృతి దివారాత్రములు ధర్మ విషయకమై యుండునో బుద్ధుని శిష్యుడగు అట్టివాడు ప్రబుద్ధుడై (జాగృతుడై) బుద్ధుడగును 297

శ్లో॥ సుప్పబుద్ధం పబుజ్ఝన్తి, సదాగోతమ సావకా।
యేసం దివా చ రత్తో చ, నిచ్చసంఘ గతా సతి॥

తా॥ ఎవని స్మృతి దివా రాత్రములు సంఘ విషయకమై యుండునో గౌతముని శిష్యుడగు అట్టివాడు జాగృతుడై బుద్ధుడగును 298

శ్లో॥ సుప్పబుద్ధం పబుజ్ఝన్తి, సదాగోతమ సావకా।
యేసం దివాచ రత్తోచ, నిచ్చంసంఘ గతాసతి॥

తా॥ ఎవనిస్మృతిదివారాత్రములు కాయానుపశ్య సంబంధియై యుండునో, బుద్ధుని శిష్యుడగు వాడు ప్రబుద్ధుడై బుద్ధుడగును 299

శ్లో॥ సుప్పబుద్ధం పబుజ్ఝన్తి, సదాగోతమ సావకా ।
యేసందివాచ రత్తోచ, అహింసాయ రతోమనో ॥

తా॥ ఎవని మనస్సు దివా రాత్రములు అహింసయందానందించునో బుద్ధుని శిష్యుడగు వాడు జాగృతుడై బుద్ధుడగును 300

శ్లో॥ సుప్పబుద్ధం పబుజ్ఝన్తి, సదాగోతమ సావకా ।
యేసం దివాచ రత్తో చ, భావనాయ రతో మనో ॥

తా॥ ఎవని మనస్సు దివా రాత్రములు భావన (ధ్యానము) యందానందించునో బుద్ధుని శిష్యుడగు వాడు జాగృతుడై బుద్ధుడగును 301

స్థానము - మహావనము (వైశాలి) వ్యక్తి - వజ్జి పుత్రక భిక్షు

శ్లో॥ దుప్పబ్బజ్జం దురభిరమం, దురావాసా ఘరా దుఖా ।
దుక్ఖోసమాన సంవాసో, దుక్ఖాను పతితద్ధగు ॥
తస్మాన చద్ధగు సియా, న చ దుక్ఖాపు పతితోసియా ॥

తా॥ దుష్ప్రవ్రజ్యా ఆనందింప దగనిది, వాస యోగ్యము కాని ఇంట నివసించుట కూడా దుఃఖదాయకమే తన సమానులు కాని వారి సహవాసము దుఃఖకారకము సంసార మార్గమున పడిన

పథికుడు దుఃఖితుడగును అందుకని సంసార మార్గమున పయ
నింపగూడదు దుఃఖితులు కాగూడదు 302

స్థానము - జేతవనము వ్యక్తి - చిత్ర గృహపతి

శ్లో॥ సుద్ధోసీలేన సంపన్నో, యసో భోగ సమప్పితో ।
యం యం పదేసంభజతి, తత్థ తత్థే పపూజితో ॥

తా॥ శ్రద్ధా శీల సంపన్నులు, కీర్తియుతులు నగు వ్యక్తులు
ఎచ్చట ఉన్నను ఉన్నచోటనే పూజింప బడుదురు 303

స్థానము - జేతవనము వ్యక్తి - అనాథ పిండిక దుహిత్

శ్లో॥ దూరే సన్తో పకాసేన్తి, హిమవంతో వ పబ్బతో ।
అస న్తేత్థ న దిస్సన్తి, రత్తిం ఖిత్తా యథా సరా ॥

తా॥ హిమవత్పర్వతము వలె సంతులు దూరము నుండియే
ప్రకాశింతురు రాత్రిచీకటిలో వదలిన బాణము వలె అసంతులు
దగ్గర నుండియు కన్పింపరు 304

స్థానము - జేతవనము వ్యక్తి - ఏకవిహారిక థేరుడు

శ్లో॥ ఎకాసనం ఎకసెయ్యం, ఎకోచరమతన్దితమ్ ।
ఎకోదమయకత్తానం, వనన్తే రమితో సియా ॥

తా॥ ఏకాసన, ఏకశయ్యలు గలవాడు, సోమరితనమును విడిచి ఏకాకియై చరించువాడు తన్నుతాను నిగ్రహించుకొనుచూ వనమునం దానందించును 305

——

# నిరయవగ్గో వావీసతిమో

## నిరయ వర్గము ఇరువది రెండవ అధ్యాయము

స్థానము - జేతవనము వ్యక్తి - సుందరి పరివ్రాజిక

శ్లో॥ అభూత వాదీ నిరయం ఉపేతి,
యోవాపి కత్వా న కరోమిచాహ ।
ఉభోపి తే పేచ్చ సమా భవన్తి,
నిహీన కమ్మా మనుజా పరత్థ ॥

తా॥ జరగని దానిని జరిగినట్లు చెప్పువారును, చేయుదునని చెప్పి చేయని వారును నరకమునకు పోవుదురు హీనకర్ములగు వారిరువురును పరలోకములో సమానులే యగుదురు 306

స్థానము - వేణువనము విషయము - దుశ్చరిత ఫలానుభవ పీడిత

శ్లో కాసావ కణ్ఠా బహవో, పాపధమ్మా అసఞ్ఞతా ॥
పాపా పాపేహి కమ్మేహి, నిరయం తే ఉప్పజ్జరే ॥

తా॥కంఠమున కాషాయ వస్త్రము దాల్చువారిలోను అనేకులు పాపులు, నిగ్రహరహితులు ఉందురు వారు తమ పాపకర్మల ఫలితముగా నరకమునకు పోవుదురు 307

స్థానము - మహావనము(వైశాలి) వ్యక్తి - వగ్గుముదా తీరభిక్షు

శ్లో॥ సెయ్యో అయోగులో భుత్తో, తత్తో అగ్గి సిఖూపమో ।
యం చే భుఞ్జేయ దుస్సీలో, రదరపిణ్డమ సంఞ్ఞతో ॥

తా॥ దురాచారుడు, నిగ్రహరహితుడునగువాడు రాష్ట్రా న్నమును దినుట కంటె జ్వలించే లోహగోళమును దినుట మంచిది 308

స్థానము - జేతవనము వ్యక్తి - ఖేమికుడు

శ్లో॥ చత్తారిరానాని నరో పమత్తో,
ఆపజ్జతి పరదారూప సేవీ ।
అపుఞ్ఞలాభం ననికామసెయ్యం,
నింద తతీయం నిరయ చరకుత్థో ॥

తా॥ పరస్త్రీని పొందు ప్రమత్తుడు, 1) పాపమును సంపాదించుకొనుట 2) మనస్సు స్థిమితముగా లేక పోవుటచే నిద్రలేమి 3) జన నింద 4) నరకము అను నాలుగుగతులను పొందును 309

శ్లో॥ అపుఞ్ఞలాభోచ గతీచ పాపికా
భీతస్స భీతాయ రతీచ థోకినా ।
రాజా చ దణ్డం గురుకం పణేతి,
తస్మానరో పరదారా నసేవే ॥

తా॥ ఇట్టివానికి పాపము, దుర్గతి, చెదిరిన గుండెలతో జరిగిన కలయికలో అల్ప సుఖము లభించును కాని రాజు వలన మాత్రము దారుణ శిక్ష విధింప బడును కావుగా ఎవ్వరును పర స్త్రీ గమనము చేయగూడదు 310

స్థానము - జేతవనము వ్యక్తి - అజ్ఞాతర దుబ్బచ భిక్షు

శ్లో॥ కుసో యథా దుగ్గహితో, హత్థమేవాను కన్తతి ।
సామఞ్ఞం దుప్పరామట్ఠం, నిరయ్యాయ ఉపకడ్ఢతి ॥

తా॥ అజాగ్రత్తగా పట్టుకొనినచో దర్భ చేతిని గాయ పరచు నట్లు అజాగ్రత్తగా తీసికొనిన సన్యాసము నరకమునకు కొని పోవును 311

శ్లో॥ యం కించి కమ్మం, సంకిలిట్ఠం, చ యం వతం ।
సంకిస్సరం బ్రహ్మ చరియం, నత హోతి మహప్ఫలం ॥

తా॥ ఏ కర్మ శిథిలమైనదో, ఏ వ్రతము క్లేశ ధర్మ యుక్త మైనదో, ఎచ్చట బ్రహ్మచర్యము శంకాకులితమైనదో, నామమాత్ర మైనదో, ఆ కర్మ మంచిది కాదు మహా ఫల దాయకమైనది కాదు

శ్లో॥ కయిరంచే కయిరాథేనం, దళ్హమేనం పరక్కమే ।
సిథిలో హి పరిబ్బజో, భియ్యో ఆకింతే రజం ॥

తా॥ ప్రవ్రజ్యను స్వీకరింప దలతువా దానిని స్వీకరింపుము దానియందు దృఢ పూర్వకముగా యత్నించుము శిలనన శిథిలమగు ప్రవ్రజ్య ధూళినే వెదజల్లును 313

స్థానము - జేతవనము వ్యక్తి - అజ్ఞాతర ఇస్త్రీపకత దత్తి

శ్లో॥ అకతం దుక్కతం సెయ్యో, పచ్ఛాతప్పతి దుక్కతం ।
కతం చ సుకతం సెయ్యో, యం కత్వా నానుతప్పతి ॥

తా॥ పాపము చేయక పోవుటమే శ్రేష్ఠము పాపము చేసిననో అది తరువాత దుఃఖమును కలిగించును సుకృతము చేయుట మంచిది దాని వలన తరువాత దుఃఖము కలుగదు 314

స్థానము - జేతవనము వ్యక్తి - సంబాహుల ఆగంతుక భిక్షు

శ్లో॥ నగరం యథా పచ్చన్తం, గుత్తం సన్తర బాహిరం ।
ఎవం గోపేథ అత్తానం, ఖణో వేమా ఉపచ్చగా ॥
ఖణాతీతాహి సోచన్తి, నిరయమ్హి సమప్పితా ॥

తా॥ సీమాంత నగరము బాహ్యాంతరముల నుండి చక్కగా రక్షింపబడునట్లు, తనను బాహ్యాంతరముల నుండి చక్కగా రక్షించు కొనవలెను ఒక క్షణమైనను వృథాసేయగూడదు ఇప్పటి కెట్లో తప్పు కొందమను ఆలోచనల వలన నరక దుఃఖము సంభవించును 315

స్థానము - జేతవనము          వ్యక్తి - నిగంఠ నాథ పుత్రుడు

అలజ్జితాయే లజ్జన్తి, లజ్జితాయే నలజ్జరే ।
మిచ్ఛాదిట్ఠి సమాదానా, సత్తా గచ్ఛంతి దుగ్గతిం ॥

తా॥ సిగ్గు పడగూడని విషయములందు సిగ్గు పడుట ,
సిగ్గుపడ దగిన విషయములందు సిగ్గు పడని మిథ్యా దృష్టిగల ప్రాణి దుర్గతిని పొందును 316

స్థానము - జేతవనము          వ్యక్తి - తిత్థియ శ్రావకుడు

శ్లో॥ అవజ్జే వజ్జమతినో, వజ్జేచా వజ్జ దస్సినో ।
మిచ్ఛాదిట్ఠి సమాదానా, సత్తా గచ్ఛన్తి దుగ్గతిం ॥

తా॥ దోషరహిత విషయములందు దోషబుద్ధినుంచువాడు,
దోషపూరిత విషయములందు దోషరహిత బుద్ధినుంచు వాడు నగు మిథ్యా దృష్టిగల ప్రాణి దుర్గతిని పొందును 317

స్థానము - జేతవనము          వ్యక్తి - నిగంఠనాథ పుత్రుడు

శ్లో॥ అభయే భయ దస్సినో, భయేచాభయ దస్సినో ।
మిచ్ఛా దిట్ఠి సమాదానా, సత్తా గచ్ఛన్తి దుగ్గతిం ॥

తా॥ భయపడ దగని విషయము లందు భయపడుచు
భయపడ వలసిన విషయములందు భయపడని మిథ్యా దృష్టిగల ప్రాణి దుర్గతిని పొందును 318

స్థానము - జేతవనము వ్యక్తి - తిత్థియ శ్రావకుడు

శ్లో॥ వజ్జంచ వజ్జతో ఞత్వా, అవజ్జంచ అవజ్జతో ।
సమ్మాదిట్ఠి సమాదానా, సత్తా గచ్ఛంతి సుగ్గతిం ॥ 14

తా॥ దోషమును దోషమని, అదోషమును అదోషమని తెలిసిన సమ్యక్ దర్శులగు ప్రాణులు సద్గతిని పొందుదురు 319

—*—

# 23. నాగవగ్గో తేవీసతిమో

## నాగ వర్గము   ఇరువది మూడవ అధ్యాయము

స్థానము - కౌశాంబి    వ్యక్తి - ఆనంద థేరుడు

శ్లో॥ అహం నాగో వ సంగామే, చాపతో పతితం సరం।
అతివాక్యం తితిక్ఖిస్సం, దుస్సీలో హి బహుజ్జనో॥

తా॥ ఏనుగు సంగ్రామ రంగమున ధనుర్నిర్ముక్తమగు అమ్ముల నోర్చునట్లు నేను కటు వాక్యముల సహింతును లోకములో దుశ్శీలురే అధికముగా కలరు 320

శ్లో॥ దంతం నయన్తి సమితిం, దంతం రాజాభిరూహతి।
దంతో సెట్ఠో మనుస్సేసు, యో తి వాక్యం తితిక్ఖతి॥

తా॥ శిక్షణ పొందిన ఏనుగును యుద్ధ రంగమునకు కొని పోవుదురు వశీకృతమగు ఏనుగును రాజు అధిరోహించును మనుష్యులలో తన్నుతాను వశపరచుకొనినవాడే శ్రేష్ఠుడు వాడు కటు వాక్యముల సహించును 321

శ్లో॥ వరమస్సతర దంతా, ఆజానీయాచ సింధవా।
కుంజరాచ మహానాగా, అత్తదంతో తతోవరం॥

తా॥ శిక్షణ పొందిన కంచరగాడిద, సింధూ దేశపు ఉత్తమా శ్వము మరియు శ్రేష్ఠమగు మహాగజము ఉత్తమమైనవి కాని ఆత్మనిగ్రహము కలవాడు వాటి కన్నను శ్రేష్ఠుడు 322

స్థానము - జేతవనము వ్యక్తి - హత్థాచారియ భిక్షు

శ్లో॥ నహి ఏతేహి యానేహి, గచ్ఛేయ్య అగతం దిసం ।
యథాత్తనా సుదన్తేన, దన్తో దన్తేత గచ్ఛతి ॥

తా॥ పై వాహనముల నధిరోహించి పోరాని దిశయగు నిర్వాణమునకు పోలేరు కాని సంయమి యగు నరుడు తన్ను చక్కగా నిగ్రహించుకొనుట వలన అక్కడికి పోగలడు 323

స్థానము - శ్రావస్తి వ్యక్తి - పరిజిణ్ణ బ్రాహ్మణపుత్రుడు

శ్లో॥ ధనపాలో నామ కుంజరో, కటుప్పభేదనో దున్నివారయో ।
బద్ధో కవలం న భుఞ్జతి, సుమరతి నాగవనస్స కుంజరో ॥

తా॥ ధనపాలమను పేరుగల మత్తమాతంగము బంధింప బడినచో గడ్డి మేయదు ఏనుగుల అరణ్యమునే స్మరించును 324

స్థానము - జేతవనము వ్యక్తి - కోసలరాజు ప్రసేనజిత్తు

శ్లో॥ మిద్ధియదా హోతి మహగ్ఘసోచ,
నిద్దాయితా సమ్పరి వత్తసాయీ ।

మహావరాహోవ నివాప పుట్ఠో,
పునప్పునం గబ్భ ముపేతి మందో ॥

తా॥ నరుడు సోమరి, నిద్రాళువు, తిండి పోతు అయినచో తిని తిని పంది వలె బలిసి పోవును అట్టి మందబుద్ధి మాటి మాటికి పునర్జన్మము నెత్తును 325

స్థానము - జేతవనము వ్యక్తి - సాను శ్రామణేరుడు

శ్లో॥ ఇదం పురే చిత్తమచారి చారికం, యేనిచ్ఛకం
యత్థానం యథా సుఖం ।
తదజ్జహ నిగ్గహేస్సామి యోనిసో,
హత్థిప్పభిన్నం వియ అకుసగ్గహో

తా॥ యీ చిత్తము మొదట తన ఇచ్చానుసారము,కామానుసారము సుఖముం వెంట చంచలముగా పరుగెత్తునది మావటీడు మదగజమును వశమొనరించు నట్లు నేడు నేను దానిని మూలముతో సహా వశమొనరించు కొందును 326

స్థానము - జేతవనము వ్యక్తి - కోసల రాజస్స పావేయ్యకహత్థి

శ్లో॥ అప్పమాద రతా హోథ, సచిత్తమను రక్ఖథ ।
దుగ్గా ఉద్ధరథత్తానం, పంకే సత్తో వ కుంజరో ॥

తా॥ అప్రమత్తతయం దానందించుము! చిత్తమును వశము నందుంచుకొనుము ఏనుగు బురద నుండి తన్ను పైకి లాగుకొను నట్లు యీ సంసార దుర్గము నుండి నిన్ను నీవు ఉద్ధరించు కొనుము 327

స్థానము - పారిలేయకము వ్యక్తి - సంబాహుల భిక్షు

శ్లో॥ ఎకస్స చరితం సెయ్యో,
నాత్థిబాలో సహాయతా ।
ఎకో చరే న చ పాపాని కయిరా,
అప్పోస్సుకో మాతంగరఞ్ఞో వ నాగో॥

తా॥ ఒంటరిగా విహరించుటే శ్రేష్ఠము మూర్ఖుని సహాయము మంచిది కాదు పాపములు చేయకుండా మాతంగారణ్యము నందలి ఏనుగు వలె ఒంటరిగా విహరించుటే ఉత్తమము 328

శ్లో॥ సచే లభేథ నిపక సహాయం,
సద్ధిం చర సాధువిహారిధీరం ।
అభిభుయ్య సబ్బాని పరిస్సయాని,
చరెయ్య తేనత్త మనోసతీమా ।

తా॥ సాధుత్వముతో విహరించు వాడు, ధైర్యశాలి, పరి పక్వ బుద్ధి గలవాడు సహాయకుడుగా లభించు యెడల ఇతర ఆశ్ర

యము లన్నిటిని వదలి స్మృతిమంతుడు, విశ్వాసచిత్తుడై
ఆర్ద్రి వానితో విచరించుటే ఉత్తమము 329

శ్లో॥ నోచే లభేథ నిపకం సహాయ,
సద్ధి చరం సాధువిహారి ధీరం ॥
రాజావ రట్ఠ విజిత పహాయ,
ఏకోచరే మాతంగ రణ్ణోవనాగో ॥

తా॥ పరిపక్వ బుద్ధిగలవాడు, సాధుత్వముతో విహరించు
వాడు, ధైర్య శాలియు నగు సహాయకుడు లభింపనిచో, రాజ్యమును
కోల్పోయిన రాజువలె, మాతంగారణ్యము నందలి ఏనుగు వలె
ఏకాకియై విహరించుటే ఉత్తమము 330

స్థానము - అరణ్యకుటీరము (హిమవత్ప్రదేశము) మారుడు

శ్లో॥ అత్థమ్హి జాతమ్హి సుఖా సహాయా,
తుట్ఠీ సుఖాయా ఇతరేతరేన ।
పుఞ్ఞం సుఖం జీవిత సంఖయమ్హి,
సబ్బస్స దుక్ఖస్స సుఖం పహాణం ॥

తా॥ కోరిక కలిగినప్పుడు భార్య సుఖము నిచ్చును
తృప్తి నిచ్చు వస్తువులన్నియు సుఖదాయకమైనవే జీవితాంతమున
పుణ్యము సుఖము నిచ్చును సర్వ దుఃఖనాశనము సుఖము
నిచ్చును 331

శ్లో॥ సుఖా మత్తెయ్యతా లోకే, అథో పేత్తెయ్యతా సుఖా ।
సుఖా సామఞ్ఞతా లోకే, అథో బ్రాహ్మఞ్ఞతా సుఖా ॥

తా॥ లోకమున మాతా-పితరుల సేవ సుఖకారిణి సర్వ జీవుల పట్ల సమభావము సుఖకారిణి బ్రాహ్మణ్యము కూడా సుఖ ప్రదాయిని 332

శ్లో॥ సుఖం యావ జరా సీలం, సుఖా సద్ధా పతిట్ఠితా ।
సుఖో పఞ్ఞాయ పటిలాభో, పాపానం అకరణం సుఖం॥ 14

తా॥ వృద్ధుడగు వరకు శీలమును పాటించుట సుఖము నిచ్చును స్థిరమైన శ్రద్ధ సుఖము నిచ్చును ప్రజ్ఞా లాభము సుఖము నిచ్చును పాపమును చేయక పోవుట వలన సుఖము కలుగును 333

—*—

# 24 తణ్హావగ్గో చతువీసతిమో

## తృష్ణా వర్గము - ఇరువది నాలుగవ అధ్యాయము

స్థానము - జేతవనము  వ్యక్తి - కపిలమచ్ఛ

శ్లో॥ మనుజస్స పమత్తచారిణో, తణ్హా వడ్ఢతి మాలువా వియా ।
సోప్లవతి హురాహురం, ఫలమిచ్ఛం వ వనస్మి వానరో ॥

తా॥ ప్రమత్తుడై (ఏమరుపాటు గలవాడై) మెలగు మానవుని యొక్క తృష్ణ మాలువా లత వలె పెరుగును అట్టివాడు అడవిలో పండ్ల కొరకు తిరుగు కోతి వలె చంచలుడై యుండును  334

శ్లో॥ యం ఎసా సహతే జమ్మీ, తణ్హాలోకె విసత్తికా ।
సోకా తస్సపవడ్ఢంతి, అభివడ్ఢం వీరణం ॥

తా॥ యీ విషమయ భయంకర తృష్ణ ఆవరించిన వాని శోకము, వీరణ మనుగడ్డి వలె పెరుగుచుండును  335

శ్లో॥ యో చేతం సహతే జమ్మీ, తణ్హాంలోకే దురచ్చయం ।
సోకా తమ్హా పపతన్తి, ఉదబిందు 'వ' పోక్ఖరా ॥

తా॥ ఈ భయంకర దుస్త్యాజ్య తృష్ణను జయించిన వారి శోకము కమలము నుండి నీటి బిందువు జారిపోవు నట్లుగా తొలగి పోవును 336

శ్లో॥ తం వో వదామి భద్దం, వో యావన్తేత్థ సమాగతా ।
తణ్హాయ మూలంఖణథ, ఉసీరత్థో వ బీరణ ।
మా యో నల వ సోతో వ, మారో భఞ్జం పునప్పునం ॥

తా॥ అందువలన నీకు ఇక్కడికి వచ్చిన వారందరికి, మీ క్షేమము కోరి చెప్పుచున్నాను వట్టివేరు కావలసిన వారు 'పీరణ' చెట్టును సమూలముగా త్రవ్వు నట్లు తృష్ణా వృక్షమును త్రవ్వి వేయుము అప్పుడు జలము కర్ర దుంగను ముంపజాల నట్లుగా మారుడు నిన్ను చలింప జేయ జాలడు 337

స్థానము - వేణువనము వ్యక్తి - గూథసూకర పోతిక

శ్లో॥ యథాపి మూలే అనుపద్దవే,
దళ్హే ఛిన్నోపి రుక్ఖో పునరేవరూహతి ,
ఎవ పి తణ్హానుసయే అనూహతో నిబ్బత్తతీ
దుక్ఖమిదం పునప్పునం ॥

తా॥ దృఢముగా పెరిగిన వృక్షమును నరికి వేసినచో తిరిగి చిగురించునట్లు తృష్ణా క్రోధముల సమూలముగా నశింప జేయనిచో యీ శోకము మరల మరల తిరిగి వచ్చును 338

శ్లో॥యస్స ఛ త్తింసతి స్రోతా, మనావస్సవనాభుసా ।
బాహా వహంతి దుద్దిట్ఠిం, సంకప్పరనిస్సితా ॥

తా॥ఎవని ముప్పదియారు స్రోతములు మనః ప్రేయములగు పదార్థములందు మిక్కిలి ప్రవృత్తములై యుండునో, అట్టి వానిని రాగ యుక్తమగు సంకల్పము ప్రవాహము వలె కొనిపోవును 339

ముప్పది యారు స్రోతములు - 1) చక్షువు 2) శ్రోత్రము 3) జిహ్వ 4) చర్మము 5) ఘ్రాణము 6) మనస్సు ఇవి అభ్యంతరమైనవి 7) శబ్దము 8) స్పర్శము 9) రూపము 10) రసనము 11) గంధము 12) ధర్మము ఈ ఆరు బాహ్యములు కామతృష్ణ రూపతృష్ణ, అరూప తృష్ణ అను మూడు భేదముంచే అవి ముప్పదియారు

శ్లో॥ సవన్తి సబ్బధి సోతా, లతా ఉబ్భిజ్జ తిట్ఠతి ।
తం చ దిస్వా లతం జాటం, మూలం పఞ్ఞాయ ఛిన్దథ ॥

తా॥ పైన చెప్పబడిన ముప్పది యారు స్రోతములు అన్ని దిక్కులకు ప్రవహించును యీ విధముగా యీ స్రోతముంతీగ అల్లుకొనును ఆ తీగవలను గమనించి ప్రజ్ఞతో దాని మొదలును నరికి వేయవలెను 340

శ్లో॥ సరితాని సినేహ తాని చ, సోమనస్సాని భవన్తి జంతు నో,
తే సాత సితా సుఖేసినో, తేవే జాతి జరూపఘా నరా ॥

తా॥ పై ముప్పది యారు నదులు స్నిగ్ధములై ప్రాణుల చిత్తమును ప్రసన్న పరచును సుఖాన్వేషణ చేయువాడు యీ నదీ ప్రవాహము లందు చిక్కి జనన మరణములను పొందుచున్నాడు

శ్లో॥ తసిణాయ పురక్ఖతా పజా, పరిసప్పన్తి ససో'వ'బంధితో ।
సంయోజన సంసత్తకా, దుక్ఖముపేన్తి పునప్పునం చిరాయ ॥

తా॥ తృష్ణావర్తులై జీవించువారు బంధింప బడిన కుందేలు వలె ఇటునటు పరుగెత్తుదురు బంధనములో చిక్కిన వారు బహుకాలము దుఃఖమునొందుదురు 342

శ్లో॥ తసిణాయ పురక్ఖతా పజ, పరిసప్పన్తి ససో వ బంధితో ।
తస్మా తసిణం వినోదయే, అకంకఖీ విరాగ మత్తనో ॥

తా॥ తృష్ణావర్తులై జీవించు వారు బంధింప బడిన కుందేలు వలె ఇటు నటు పరుగెత్తుదురు అందు వలన వైరాగ్యమును కోరువారు తృష్ణను దూరమొనరింప వలెను 343

స్థానము - వేణువనము వ్యక్తి - విభంతక భిక్షు

శ్లో॥ య నిబ్బనథో వనాధిముత్తో, వనముత్తో వనమేవ ధావతి ।
తం పుగ్గలమేవ పస్సథ ముత్తో, బంధనమేవ ధావతి ॥

తా॥ వనము నుండి (కామేచ్ఛల నుండి) ముక్తుడై తిరిగి వనమువైపు పరుగెత్తు ఆ పుద్గలుని చూడుము ముక్తుడయినను తిరిగి ఆతడు బంధనము వేపు పరుగెత్తు చున్నాడు 344

24-తృష్ణా వర్గము

స్థానము - జేతవనము బంధనాగార విషయము

శ్లో॥ నతం దలూహ బంధన మాహుధీరా,
యయదాసం దారుజ బబ్బజంచ ।
సారత్త రత్తా మణికుండలేసు,
పుత్తేసు దారేసుచ యా అపేక్షా ॥

తా॥ ధైర్యశాలి ఇనుప లేదా కర్ర సంకెళ్ళను గ
త్రాళ్ళనుగాని బంధనములని తలంచడు వాస్తవమున మణికుం
ములయందు,దారాపుత్రాదుల యందు గల అపేక్షయే బంధనము

స్థానము - రాజగృహము వ్యక్తి - క్షేమ

శ్లో॥ యే రాగ రత్తాను పతన్తి సోతం,
సమంకత మక్కటకో వ జాలం
ఎతం పి ఛేత్వాన వజన్తి ధీరా
అనపేక్షినో సబ్బ దుఃఖం పహాయ ॥

తా॥ సాలెపురుగు తాను నిర్మించుకున్న వలలో తానే చి
నట్లు, రాగము నందనురక్తులగువారు, తృష్ణా రూప ప్రవా
నందు పడిపోవుదురు నిరపేక్షితుడు, ధైర్యశాలియునగు
దీనిని కూడా కోసివేసి సర్వ దుఃఖముల వదలి
పోవును

స్థానము - వేణువనము వ్యక్తి - ఉగ్రసేన శ్రేష్ఠి

శ్లో॥ ముఞ్చపురే ముఞ్చ పచ్ఛాతో, మఞ్ఝే ముఞ్చ భవస్సపారగూ।
సబ్బత్థ విముత్తా మానసో, న పునం జాతి జరం ఉపహేసి ॥

తా॥ వెనక ముందు మరియు మధ్య యందును తృష్ణను వదలి భవమును తరింపుము సకల విధముల ముక్తుడవగు నీవు తిరిగి జన్మ జరలను పొందవు వెనకనుండు నది సంచిత కర్మము (భూతము) ముందుండునది ఆగామి కర్మము (భవిష్యత్తు) మధ్య యందునది ప్రారబ్ధ కర్మము (వర్తమానము)

స్థానము - జేతవనము వ్యక్తి - చుల్ల ధనుగ్గహ పండితుడు

శ్లో॥ వితక్కమథితస్స జంతునో, తిబ్బరాగస్స సభానుపస్సినో,
మియ్యో తణ్హా పవడ్ఢతి ఎస ఖో దల్హాహం కిరోతి బంధనం॥

తా॥ సందేహముతో తీవ్రమైన రాగము కలవారియొక్కయు మరియు లోక మునంతయు సుందరము సుఖమయమని తలంచు వారి యొక్కయు తృష్ణ పెరుగుచుండును ఇట్టివారు నిశ్చయముగా తమ బంధమును గట్టి పరచు కొందురు 349

శ్లో॥ వితక్కూప సమేచ యోరతో,అసుభం భావయ తె సదా సతో
ఎస ఖో వ్యన్తి కాహితి, ఎస ఛేచ్ఛతి మార బంధనం ॥

తా॥ సంశయమును ఉపశమింప జేయువారు, స్మృతి మంతులు సంసారము నందలి అశుభమును గమనించు వారు నిశ్చయముగా మారబంధనముల నరికి నష్టమొనరింతురు 350

స్థానము - జేతవనము వ్యక్తి - మారుడు

శ్లో॥ నిట్ఠంగితో అసంతాసీ, వీత తణ్హో అనఙ్గనో ।
అచ్ఛిన్ది భవసల్లాని, అంతిమోయం సముస్సయే ॥

శ్రద్ధా పరులు, భయరహితులు, తృష్ణా శూన్యులు మరియు నిరంజనులు నగు వారు సంసార శల్యములను నరికి వేయుదురు వారికి ఇదే చివరి జన్మము 351

శ్లో॥ వీత తణ్హో అనాదానో, నిరుత్తి పదకోవిదో ।
అక్ఖరానం సన్నిపాతం, జఞ్ఞో పుబ్బా పరానిచ ।
సవే అన్తిమ సారిరో, మహాపఞ్ఞోమహాపురిసోపి ఉచ్చతి ॥

తా॥ తృష్ణారహితులు, అపరిగ్రహులు, శబ్దముల నిర్వచన భాషయందు పండితులు (నిరుక్త పండితులు) అక్షరముల పూర్వార్థ సన్నిపాతమును తెలిసిన వారు నిశ్చయముగా అంతిమ శరీరధారులు మహాప్రాజ్ఞులు, మహాపురుషులు అనబడుదురు 352

స్థానము - అంతరామ గయ వ్యక్తి -ఉపక ఆజీవకుడు విన్నది

శ్లో॥ సబ్బా భిభూ సబ్బ విదూహమస్మి,
సబ్బేసు ధమ్మేసు అనూపలిత్తో ।

సబ్బఞ్ఞహా తణ్హక్ఖయే విముత్తో ।
సయం అభిఞ్ఞాయ సముద్దిసెయ్యం ॥

తా॥ నేను సర్వవిభుడను, సర్వజ్ఞుడను, ఏ ధర్మము నంటని వాడను, సర్వస్వమును పరిత్యజించిన వాడను తృష్ణాక్షయము సిద్ధించుట వలన ముక్తుడను ఇట్టి నాకు (గురువుగా) ఎవరిని చెప్ప గలను ? 353

స్థానము - జేతవనము వ్యక్తి - దేవరాజు శక్రుడు

శ్లో॥ సబ్బదానం ధమ్మదానం జినాతి,సబ్బరసం ధమ్మరసోజినాతి
సబ్బరతిం ధమ్మరతిం జినాతి, తణ్హక్ఖయో సబ్బదుక్ఖం జినాతి

తా॥ ధర్మము యొక్క దానము దానములందు మిన్న, రసములందు ధర్మరసము మిన్న ధర్మానురక్తి సకల రాగముల జయించును తృష్ణాక్షయము సకల దుఃఖముల జయించును 354

స్థానము - జేతవనము వ్యక్తి - అపుత్రక శ్రేష్ఠి

శ్లో॥ హనన్తి భోగాదుమ్మేధం, నో చే పారగవేసినో ।
భోగ తణ్హాయ దుమ్మేధో, హన్తి అఞ్ఞేవ అత్తనం ॥

తా॥ సంసారమును తరించి పోవలెనని ఇచ్ఛయించని దుర్బుద్ధి యొక్క భోగములు క్షీణించి పోవును అయినను, భోగములందలి తృష్ణచే ఆ దుర్బుద్ధి తనను ఇతర విధముల చంపు కొనును, 355

స్థానము - పొందు కంటలశిల వ్యక్తి - అంకురుడు

శ్లో॥ తిణ దోసానిఖేత్తాని, రాగ దోసాఅయం పజా ।
తస్మాహి వీతరాగేసు, దిన్నం హోతి మహ ప్ఫలం ॥

తా॥ గడ్డి పంట చెల యొక్క దోషము యీ ప్రజల దోషము రాగము అందువలన వీతరాగుల (భిక్షువుల)కు ఇచ్చు దానము మహా ఫల దాయకము 356

శ్లో॥ తిణదోసాని ఖేత్తాని, దోస దోసా అయం పజా ।
తస్మాహి వీత దోసేసు, దిన్నం హోతి మహప్ఫలం ॥

తా॥ గడ్డి పంట చేల యొక్క దోషము యీ ప్రజల దోషము ద్వేషము అందువలన వీతద్వేషులకు ఇచ్చు దానము మహా ఫలవంత మగును 357

శ్లో॥ తిణదోసాని ఖేత్తాని, మోహ దోసా అయం పజా ।
తస్మాహి వీతమోహేసు, దిన్నం హోతి మహప్ఫలం ॥

తా॥ గడ్డి పంట చేల యొక్క దోషము యీ ప్రజల యొక్క దోషము మోహము అందువలన వీత మోహులకు ఇచ్చు దానము మహా ఫల దాయకము 358

శ్లో॥ తిణ దోసాని ఖేత్తాని, ఇచ్ఛాదోస అయం పజా ।
తస్మాహి విగతిచ్ఛేసు, దిన్నం హోతి మహప్ఫలం ॥26॥

తా॥ గడ్డి తోటల యొక్క దోషము వాంఛ యీ ప్రజం దోషము అందువలన వాంఛా రహితులగు భిక్షువులకిచ్చు దానము మహా ఫలవంతమైనది ౩౫౯

---

# 25. భిక్ఖువగ్గో పంచవీసతిమో

## భిక్షు వర్గము ఇరువది యైదవ అధ్యాయము

స్థానము - జేతవనము వ్యక్తి - పఞ్చభిక్ఖు

శ్లో॥ చక్ఖునా సంవరో సాధు, సాధు సోతేన సంవరో ।
ఘానేన సంవరో సాధు, సాధు జివ్హాయ సంవరో ॥

తా॥ నేత్రేంద్రియ నిగ్రహము మంచిది శ్రోత్రేంద్రియ నిగ్రహము మంచిది ఘ్రాణేంద్రియ నిగ్రహము మంచిది జిహ్వేంద్రియ నిగ్రహము ఉత్తమమైనది 360

శ్లో॥ కాయేన సంవరో సాధు, సాధు వాచాయ సంవరో ।
మనసా సంవరో సాధు, సాధు సబ్బత్థ సంవరో ॥

తా॥ కాయ నిగ్రహము మంచిది వచో నిగ్రహము ఉత్తమమైనది మనో నిగ్రహము మంచిది సర్వేంద్రియ నిగ్రహము ఉత్తమమైనది 361

స్థానము - జేతవనము వ్యక్తి - హంస ఘాతకుడు

శ్లో॥ హత్థ సంయతో వాచాయ, సంయతో సంయ తుత్తమో ।
అజ్ఝత్తరతో సమాహితోఎకో, సంతుసినో తమాహు భికుం ॥

తా॥ చెలులతో సంయమము, పాదములతో సంయమము మాటలతో సంయమము ఉత్తమమైన సంయమము అధ్యాత్మ యందు ఏకాగ్రమగు నిష్ఠగలవాడు, ఏకాంగుడు సంతుష్టుడునగు వాడు భిక్షువనబడేను 362

స్థానము - జేతవనము కోకాలికుడు

శ్లో॥ యో ముఖసంయతో భిక్ఖు, మన్తభాణీ అనుద్ధతో ।
అత్థం ధమ్మంచ దీపేతి, మధురం తస్స భాసితం ॥

తా॥ వాక్కును నిగ్రహించు భిక్షువు ఆలోచించి మాటాడును అనుద్ధతుడై ధర్మార్థముల ప్రకటించును అతని సంభాషణ మధురముగా నుండును 363

స్థానము - జేతవనము వ్యక్తి - ధర్మారామ థేరుడు.

శ్లో॥ ధమ్మారామో ధమ్మరతో, ధమ్మం అనువిచింతయం ।
ధమ్మం అనుస్సరం భిక్ఖు, సద్ధమ్మా న పరిహాయతి ॥

తా॥ ధర్మము నందానందించువాడు ధర్మరతుడునగు భిక్షువు ధర్మచింతనము చేయుచూ సద్ధర్మము నుండి ఎన్నడూ పతనము చెందడు 364

స్థానము - వేణువనము వ్యక్తి - విపక్ష సేవకుడు.

శ్లో॥ సలాభం నాతి మఞ్ఞేయ్య, నాఞ్ఞేసం పిహయం చరే ।
అఞ్ఞేసం పిహయం భిక్ఖు, సమాధినాధి గచ్ఛతి ॥

తా॥ తన లాభమును హేళన చేయకుము ఇతరుల యెడల యీర్ష్య గలిగి యుండకుము పరుల పట్ల ఈర్ష్య గలవారు సమాధిని పొందజాలడు 365

శ్లో॥ అప్ప లాభోపి చే భిక్ఖు, సలాభం నాతిమఞ్ఞతి ।
తం వే దేవా పసంసన్తి, సుద్ధాజీవిం అతన్దితం ॥

తా॥ తన లాభము కొంచెమైనను దానిని అవహేళన చేయ గూడదు పరిశుద్ధ జీవనుడు, నిరాలంబనుడు అగు అట్టి వానిని దేవతలు ప్రశంసింతురు 366

స్థానము - జేతవనము వ్యక్తి పంచగ్గ దాయక బ్రాహ్మణుడు

శ్లో॥ సబ్బసో నామరూపస్మిం, యస్సనాత్థి మమాయితం ।
అసతాచ నసోచతి, స వే భిక్ఖూం తి వుచ్చతి ॥

తా॥ నామ రూపము లందెవనికి మమత లేదో, నాకేమియ లేదని ఎవడు చింతించడో, వాడు నిశ్చయముగా భిక్షువన బడును

స్థానము - జేతవనము వ్యక్తి - సంబాహుల భిక్షువు

శ్లో॥ మేత్తా విహారీ యో భిక్ఖూ, పసన్నో బుద్ధాసాసనే ।
అధిగచ్ఛేపదం సంతం, సంఖారూపసమ సుఖం ।

తా॥ మైత్రీ పూర్వకముగా విహరించు భిక్షువు, బుద్ధశాసన మందు ప్రసన్నుడై యుండు వాడు, సంస్కారముల శాంతింపజేసి శాంతమును, సుఖదము నగు పదవిని పొందును 368

శ్లో॥ సిఞ్చ భిక్ఖూ ఇమం నావం, సిత్తా తే లహుమేస్సతి ।
ఛేత్వా రాగంచ దోసంచ, తతో నిబ్బాన మేహసి ॥

తా॥ ఓ భిక్షూ! యీ శరీరరూప నావను ఖాళీ చేయుము (రాగాది మలములను తొలగింపుము) ఖాళీ చేయబడిన నావ తేలిక అగును అప్పుడు నీవు రాగ ద్వేషముల ఛేదించి నిర్వాణమును పొందుదువు 369

శ్లో॥ పంచ ఛింధే పంచజహే, పంచ చుత్తరి భావయే ।
పంచ సఙ్గాతిగో భిక్ఖూ, ఓఘ తిణ్ణో 'తి' వుచ్చతి ॥

తా॥ అయిదింటిని నరకుము [2]అయిదింటిని వదలుము ఎదవ [3]అయిదింటిని భావించుము [4]అయిదింటి సంపర్కము నుండి వేరుగా నుండు భిక్షువు ఓఘతీర్ణుడు అనగా కామము, భవము అవిద్య మొదలగు నదులను తరించినవాడన బడును 370

---

1) రూపము 2) రాగము 3) మానము 4) ఔద్ధత్యము 5) అవిద్య

2) 1) సంశయము 2) అహంకారము 3) సుఖము 4) దృష్టి వ్రతము 5) హింస

3) 1) శ్రద్ధ 2) శక్తి 3) స్మృతి 4) సమాధి 5) ప్రజ్ఞ

4) 1) ద్వేషము 2) రాగము 3) లోభము 4) కామము 5) మోహము

శ్లో॥ ఝాయ భిక్ఖు మా పరమాదో,
మా తే కామగుణే రమేస్సు చిత్తం ।
మా లోహ గులంగిలీ పమత్తో,
మా కన్ది దుక్ఖమిది దయ్హ మానో ॥

తా॥ ఓ భిక్షూ! పొరపాటు లేకుండా ధ్యానము చేయుము నీ చిత్తము కామగుణమున రమింప గూడదు ప్రమత్తుడవై జ్వలించే లోహ గోళమును తాకకుము సంసారాగ్నిలో జ్వలిస్తూ బాధగా నున్నదని ఆక్రందింపకుము 371

శ్లో॥ నత్థి ఝానం అపఞ్ఞస్స, పఞ్ఞా నత్థి అఝాయతో ।
యమ్హి ఝానంచ పఞ్ఞంచ, సవే నిబ్బాణ సన్తికే ॥

తా॥ ప్రజ్ఞ లేనిదే ధ్యానము కాన సాధు ధ్యానము చేయు నితో ప్రజ్ఞ నిండదు ఎవనిలో ధ్యాన ప్రజ్ఞ లున్నవో వాడు నిర్వాణ మునకు సమీపములో నున్నాడు 372

శ్లో॥ సుఞ్ఞాగారం పవిట్ఠస్స, సన్త చిత్తస్స భిక్ఖునో ।
అమానుసీ రతీ హోతి, సమ్మా ధమ్మం విపస్సతో ॥

తా॥ శూన్యాగారమున (ఏకాంతమున) ప్రవిష్టుడై, శాంత చిత్తుడై, సమ్యక్ ధర్మమును దర్శించు భిక్షువు యొక్క ఆనందము అమానుషమైనది (లోకోత్తరమైనది.) 373

శ్లో॥ యతోయతో సమ్మసతి, ఖంధానం ఉదయబ్బయం ।
లభతి పీతి పామోజ్జం, అమితం తం విజానతం ॥

తా॥ స్కంధముల యొక్క ఉత్పత్తి-వినాశముల గూర్చిన ఆలోచన పెరుగు కొలది,అతనికి జ్ఞానుం ఆదరము,అమృతానందము ప్రాప్తించును 374

శ్లో॥ తత్రాయ మాది భవతి, ఇధ పఞ్ఞస్స భిక్ఖునో ।
ఇంద్రియ గుత్తి సంతుట్ఠి, పాతి మోక్ఖేచ సంవరో ॥

తా॥ ఇంద్రియ నిగ్రహము, సంతుష్టి, మరియు ప్రాతిమోక్ష నియమ పాలనమను వీటి వలన ప్రాజ్ఞమగు భిక్షు జీవితము ఆరంభమగుచున్నది 375

శ్లో॥ మిత్తే భజస్సు కల్యాణే, సుద్ధా జీవే అతన్దితే ।
పటిసంథారవుత్తస్స, ఆచారకుసలోసియా ।
తతో పామోజ్జ బహులో, దుక్ఖస్సంతం కరిస్సతి ॥

తా॥ విశుద్ధ జీవనులు, ఆలస్యరహితులు, శుభంకరులునగు మిత్రులతో చరింపుము సేవా సత్కారాదుం నొనరించుచూ, సదాచారమును పాటించుచూ, దుఃఖమును నశింప చేయగలవు 376

స్థానము - జేతవనము వ్యక్తి - పంచశత భిక్షు

శ్లో॥ వస్సికా వియపుప్ఫాని, మద్దవాని పముచ్చతి ।
ఏవం రాగంచ దోసంచ, విప్పముచ్చేథ భిక్ఖవో ॥

తా॥ మల్లె చెట్టు వాడిన పూలను రాల్చివేయు నట్లుగా, ఓ భిక్షువులారా ! రాగ ద్వేషముల వదలి వేయండి ! 377

స్థానము - జేతవనము వ్యక్తి - శాంతకాయ థేరుడు

శ్లో॥ సన్తకాయో సన్తవాచో, సన్తవా సుసమాహితో ।
వన్తలోకామిసో భిక్ఖు, ఉపసన్తో తి వుచ్చతి ॥

తా॥ శాంత శరీరుడు, శాంత వచస్కుడు, శాంత చిత్తుడు, చక్కని ఏకాగ్రత కల్గినవాడు, సంసార భోగ వస్తువుల త్యజించు వాడు నగు భిక్షువు ఉపశాంతు డనబడును 378

స్థానము - జేతవనము వ్యక్తి - నంగల కుల థేరుడు

శ్లో॥ అత్తనా చోదయత్తానం, పటివాసే అత్తమత్త నా ।
సో అత్త గుత్తో సతిమా, సుఖం భిక్ఖు విహాహిసి ॥

తా॥ తన్ను తానే ప్రేరేపించు కొనవలెను తనకు తానే ధ్యాన మగ్నుడు కావలెను తన్ను చక్కగా రక్షించు కొను స్మృతి మంతుడగు అట్టి భిక్షువు సుఖ పూర్వకముగా విహరించును 379

శ్లో॥ అత్తాహి అత్తనో నాథో, అత్తాహి అత్తనో గతి ।
తస్మా సంయమయత్తానం, అస్సం భద్రం వ వణిజో ॥

తా॥ తనకు తానే యజమానుడు తానే తనకు శరణ్యుడు అందువలన వ్యాపారి ఉత్తమాశ్వమును కాపాడుకొను నట్లు తన్ను చక్కగా నిగ్రహించు కొనవలెను 380

స్థానము - జేతవనము వ్యక్తి - వక్కలి థేరుడు

శ్లో॥ పామోజ్జబహులో భిక్ఖు, పసన్నో బుద్ధ సాసనే ।
అధిగచ్ఛే పదం సంతం, సంఖారూప సమం సుఖం ॥

తా॥ అధిక ప్రమోదమును పొందువాడు, బుద్ధశాసన మందు ప్రసన్నుడై యుండు వాడు, సంస్కారముల శమింప జేయువాడు, సుఖకరమును, శాంతమునగు పదవిని (నిర్వాణమును) పొందును

స్థానము ,- పూర్వారామము వ్యక్తి - సుమన శ్రామణేరుడు

శ్లో॥ యో హవే దహరో భిక్ఖు, యుఞ్జతి బుద్ధ సాసనే ।
సో ఇమం లోకం పభాసేతి, అబ్భాముత్తో 'వ' చన్దిమా ॥ 23

తా॥ యువకుడగు భిక్షువు బుద్ధ శాసనమందు నిమగ్నుడగుచో, మేఘ ముక్తుడగు చంద్రుని వలె లోకమును వెల్గించుచు 382

# 26. బ్రాహ్మణ వగ్గో చవ్వీసతిమో

## బ్రాహ్మణ వర్గము ఇరువది యారవ అధ్యాయము

స్థానము - జేతవనము వ్యక్తి - పసాద బహుల బ్రాహ్మణుడు

శ్లో॥ ఛిన్ద సోత పరక్కమ్మ, కామే పనుద బ్రాహ్మణ ।
సంఖారానాం ఖయం ఞత్వా, అకతఞ్ఞూసి బ్రాహ్మణ ॥

తా॥ఓ బ్రాహ్మణుడా! పరాక్రమముతో తృష్ణా స్రోతస్సును ఛిన్నాభిన్నము చేయుము సంస్కారక్షయమును తెలిసి ఓ బ్రాహ్మణుడా ! నిర్వాణమును పొందువాడ వగుదువు 383

స్థానము - జేతవనము వ్యక్తి - సంబాహుల భిక్షు.

శ్లో॥ యదా ద్వయేస ధమ్మేసు, పారగూ హోతి బ్రాహ్మణో ।
అథస్స సబ్బే సంయోగా, అత్థం గచ్ఛన్తి జానతో ॥

తా॥ బ్రాహ్మణుడు నిగ్రహము, ధ్యానము అను రెండు ధర్మముల పారంగతుడైనప్పుడు సకల సంయోజన బంధనముల నష్టమొనరించును 384

స్థానము - జేతవనము వ్యక్తి - మారుడు

శ్లో॥ యస్స పారం అపారంవా, పారాపారం న విజ్జతి ।
వీతద్దరం విసంయుత్తం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ ఎవనికి పారము మరియు అపారము గాని, పారాపార ములు గాని లేవో అట్టి భయరహిత అనాసక్తునే నేను బ్రాహ్మణు డందును 385

స్థానము - జేతవనము వ్యక్తి - అఙ్ఞతర బ్రాహ్మణుడు

శ్లో॥ ఝాయిం విరజమాసీనం, కత కిచ్చ మనాసవం ।
ఉత్తమత్తమనుప్పత్తం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ ధ్యాన శీలుడు, మలరహితుడు, స్థిరుడు, కృతకృత్యుడు చిత్తమలముల శూన్యమొనరించి ఉత్తమార్థమగు సత్యమును పొందిన వాడునగు వానినే నేను బ్రాహణు డందును 386

స్థానము - మృగారమాత ప్రాసాదము వ్యక్తి - ఆనందథేరుడు

శ్లో॥ దివా తపతి ఆదిచ్చో, రత్తిమా భాతి చన్దిమా ।
సన్నద్ధ ఖత్తియో తపతి, ఝాయో తపతి బ్రాహ్మణో ।
అథ సబ్బ మహోరతిం, బుద్ధో తపతి తేజసా ॥

తా॥ పగలు సూర్యుడు ప్రకాశించును రాత్రి చంద్రుడు వెలుగును యుద్ధ సన్నద్ధ క్షత్రియుడు, ధ్యానశీల బ్రాహ్మణుడు

ప్రకాశింతురు వీరందరిని మించి బుద్ధుడు తన పంచపీఠ తేజములతో దివారాత్రములు ప్రకాశించును 387

స్థానము - జేతవనము వ్యక్తి - అజ్ఞతర బ్రాహ్మణుడు.

శ్లో॥ బాహిత పాపోతి బ్రాహ్మణో,
సమ చరియా సమణోతి వుచ్చతి ।
పబ్బాజయమత్తనో మలం,
తస్మా పబ్బజితాతి వుచ్చతి ॥

తా॥ పాపమును పారద్రోలిన వాడు బ్రాహ్మణుడన బడును సమతాచరణ కలవాడు శ్రమణుడన బడును తన మలినములను తొలగించు కొనిన వాడు ప్రవ్రజితు డన బడును 388

స్థానము - జేతవనము వ్యక్తి - సారిపుత్ర థేరుడు

శ్లో॥ న బ్రాహ్మణస్స పహరెయ్య, నాస్సముఞ్చేథ బ్రాహ్మణో ।
ధీ బ్రాహ్మణస్స హన్తారం, తతోధీ యస్స ముచ్చతి ॥

తా॥ బ్రాహ్మణుని కొట్టగూడదు కొట్టిన వాని పై బ్రాహ్మణుడు కోపింపగూడదు బ్రాహ్మణుని కొట్టు వాడు, కొట్టువానిని కోపించు బ్రాహ్మణుడు ధిక్కార యోగ్యులు 389

శ్లో॥ న బ్రాహ్మణ స్తే తదకించ సెయ్యో,
యదా నిసేధో మనసో పియేహి ।

యతో యతో హింస మనో నివత్తతి,
తతో తతో సమ్మతిమేవ దుక్ఖం ॥

తా॥ బ్రాహ్మణునికై యీ కర్మ శ్రేయస్కరమైనది కాదు అతడు ప్రియ పదార్థముల నుండి మనస్సును నిరోధించును హింసా పూరిత కర్మలనుండి మనస్సు వెనుదిరిగిన కొలది దుఃఖము శాంతించును 390

స్థానము - జేతవనము వ్యక్తి - మహాప్రజాపతి గౌతమి

శ్లో॥ యస్స కాయేన వాచాయ, మనసా నాత్థి దుక్ఖతం ।
సంవృతం తీహి రానేహి, తమహం బ్రూమి బ్రాహ్మణమ్॥

తా॥ మనోవాక్కాయములచే ఎవడు దుష్కర్మలు చేయడో, త్రికరణ శుద్ధి గలవాడెవడో వానినే నేను బ్రాహ్మణు డందును 391

స్థానము - జేతవనము వ్యక్తి - సారిపుత్ర థేరుడు

శ్లో॥ యమ్హా ధమ్మం వి- నెయ్య, సమ్మా సంబుద్ధ దేసితం ।
సక్కచ్చం తం నస్స సెయ్య, అగ్గి హుత్తం వ బ్రాహ్మణో ॥

తా॥ బ్రాహ్మణుడు అగ్ని హోత్రమునకు నమస్కరించు నట్లు సమ్యక్ సంబుద్ధుని శిష్యునికి నమస్కరింపుము 392

స్థానము - జేతవనము వ్యక్తి - జటిల బ్రాహ్మణుడు

శ్లో॥ నజటాహి న గోత్తేన, న జచ్చాహోతి బ్రాహ్మణో ।
యమ్హి సచ్చంచ ధమ్మోచ, సో సుఖీ సోచ బ్రాహ్మణో ॥

తా॥ జటాధారణమున గాని, జన్మ గోత్రములచే గాని ఎవడును బ్రాహ్మణుడు కాజాలడు ఎవనిలో సత్య ధర్మములున్నవో, వాడే సుఖి మరియు బ్రాహ్మణుడు 393

స్థానము - కూటాగారశాల వ్యక్తి - వగ్గులివత్తి కుహకబ్రాహ్మణుడు

శ్లో॥ కిం తే జటాహి దుమ్మేధ, కింతే అజిన సాటియా ।
అబ్బంతరం తే గహనం, బాహిరం పరిమజ్జసి ॥

తా॥ ఓరి దుర్బుద్ధీ! నీ జడలేమన్నవి? నీ మృగ చర్మాంబర మేమన్నది? నీహృదయము గహనముగా నున్నది బయట కడిగి లాభమేమి ? 394

స్థానము - గృధ్ర కూటము వ్యక్తి - కృశ గౌతమి

శ్లో॥ పంసుకూలధరం జంతుం, కిసం ధమనిసన్థత ।
ఎక వనస్మి ఝాయంతం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ పాంసుకూలధరుడు, ధమనులు వల వలె కన్పడు నంతగా కృశించినవాడు, వనములో ఏకాంతమున ధ్యానమొనరించు వాడు నగు వానినే నేను బ్రాహ్మణు డందును 395

పాంసు కూలము - పాతగుడ్డల పీలికలతో కుట్టిన వస్త్రము

స్థానము - జేతవనము వ్యక్తి - ఏక బ్రాహ్మణుడు

శ్లో॥ న చాహం బ్రాహ్మణ బ్రూమి, యోనిజ మత్తి సంభవ ।

భోవాదీ నామ సో హోతి, సచే హోతి సకిఞ్చనో ।
అకించనం అనాదానం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ బ్రాహ్మణ వంశమున జన్మించి నంతనే, ఒకనిని నేను బ్రాహ్మణుడనను వాడు అహంకారి మరియు సంగ్రహ బుద్ధి యగును ఎవడు అకించనుడో, అపరిగ్రహుడో వానినే నేను బ్రాహ్మణుడందును 396

స్థానము - వేణువనము వ్యక్తి - ఉగ్రసేన శ్రేష్ఠిపుత్రుడు

శ్లో॥ సబ్బ సంయోజనం ఛేత్వా, యోవే న పరితస్సతి ।
సఙ్గాతిగం విసంయుత్తం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ సకల బంధనముల ఛేదించి నిర్భయుడైన వాడు, సంగము, ఆసక్తి వదలిన వానినే నేను బ్రాహ్మణుడందును 397

స్థానము - జేతవనము వ్యక్తి - ద్వై బ్రాహ్మణుడు

శ్లో॥ ఛేత్వానందిం వరత్తంచ, సందానం సహనుక్కమం ।
ఉక్ఖిత్త పలఘిం బుద్ధం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ లౌకిక ఆనందమును, రాగరూప రజ్జువును, మోహ రూప జాలమును ఛేదించి అవిద్యా రూపమునెనున్న కవాటమును తొలగించు వానినే నేను బ్రాహ్మణుడందును 398

స్థానము - వేణువనము వ్యక్తి - అక్కోసక భారద్వాజుడు

శ్లో॥ అక్కోసం బధబంధంచ, అదుట్ఠోయో తితిక్ఖతి ।
ఖన్తీబల బలానీకం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ ఎవడు దుష్టుడు కాడో, దూషణమును వధను ఎవడు సహించునో, క్షమయే బలముగా, సైన్యముగా కలవాడెవడో వానినే నేను బ్రాహ్మణుడందును 399

స్థానము - వేణువనము వ్యక్తి - సారిపుత్ర థేరుడు

శ్లో॥ అక్కోధనం వతవంతం, సీలవంతం అనుస్సుతం ।
దన్తం అంతిమ సారీరం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ క్రోధము లేనివాడు, నిష్టాపరుడు, అనుశ్రుతుడు, దాంతుడు మరియు అంతిమ శరీరధారియగు వానినే నేను బ్రాహ్మణుడందును 400

స్థానము - జేతవనము వ్యక్తి - ఉత్పలవర్ణ థేరి

శ్లో॥ వారి పోక్ఖర పత్తే వ, ఆరగ్గేరివ సాసపో ।
యో న లిప్పతి కామేసు, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ పద్మ పత్రమున నీరు, సూదిమొనయందు ఆవలు నిలువ జాలనట్లు ఎవడు కామములను అంటడో, వానిని నేను బ్రాహ్మణుడందును 401

స్థానము - జేతవనము వ్యక్తి - అజ్ఞతర బ్రాహ్మణుడు

శ్లో॥ యో దుక్ఖస్స పజానాతి, ఇధేవ ఖయమత్తనో ।
పన్నభారం విసంయుత్తం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ ఎవడు తన దుఃఖము నశించినదని తెలిసి కొనునో, అవిద్యా రూప భారమును ఆ లగించు కొనునో, మరియు అనాసక్తుడో వానినే నేను బ్రాహ్మణు డందును 402

స్థానము - గృధ్ర కూట పర్వతము వ్యక్తి - క్షేమా భిక్షుణి

శ్లో॥ గంభీర పఞ్ఞం మేధావిం, మగ్గామగ్గస్స కోవిదం ।
ఉత్తమత్థం అనుప్పత్తం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ గంభీర ప్రజ్ఞకలవాడు, మేధావి, మార్గామార్గ కోవిదు డు ఉత్తమార్థమును పొందిన వాడునగు వానినే నేను బ్రాహ్మణు డందును 403

స్థానము - జేతవనము వ్యక్తి - పభ్భార నివాసి తిష్యథేరుడు

శ్లో॥ అసంసట్ఠ గహట్ఠేహి, అనాగారేహి చూభయం ।
అనోకసారిం అప్పిచ్ఛం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ గృహస్థుడు, గృహరహితుడు అను యీ రెండు విధ ముల నంటని వాడు, స్థిరనివాసము లేకుండా చరించువాడు,

స్వల్పమగు కోరికలు కలవాడు నగు వానినే నేను బ్రాహ్మణు డందును 404

స్థానము - జేతవనము వ్యక్తి - అజ్ఞతర భిక్షు

శ్లో॥ నిధాయ దణ్డం భూతేసు, థసేసు థావారేసు చ ।
యో న హన్తి న ఘాతేతి, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ ఎవడు చరాచర ప్రాణులపై దండమును ప్రయోగించడో, కొట్టడో, కొట్టటరు ప్రేరేపించడో, వానినే నేను బ్రాహ్మణు డందును 405

స్థానము - జేతవనము చత్తారో శ్రామణేరుడు,

శ్లో॥ అవిరుద్ధం విరుద్ధేసు, అత్తదండేసు నిబ్బుతం ।
సాదానేసు అనాదాన, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ విరోధుల మధ్య అవిరోధియు, దండధరుల మధ్య దండనివృతుడు, సంగ్రహ పరుల మధ్య అసంగ్రాహియగు వానినే నేను బ్రాహ్మణు డందుసు 406

స్థానము - వేణువనము వ్యక్తి - మహాపంథక థేరుడు

శ్లో॥ యస్స రాగో చ దోసోచ, మానో మక్ఖోచ పాతితో ।
సాసపోరివ ఆరగ్గా, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ ఎవని రాగ ద్వేషములు, అభిమాన దంభములు సూది మొనపై నుండి ఆవాల వలె జారి పోయినవో, వానినే నేను బ్రాహ్మణు డందును 407

స్థానము - వేణువనము పిలింద వచ్ఛ థేరుడు

శ్లో॥ అక్కసం విఞ్ఞాపనిం, గిర సచ్చముదీరయే ।
యాయ నాభి సజేకఞ్చ, తమహం బ్రూమి బ్రాహ్మణం॥

తా॥ ఎవని వాక్కు కోమలము, జ్ఞాన వర్ధకము, సత్య యుతమునై యుండునో, ఇతరులకు బాధ కల్గింపదో వానినే నేను బ్రాహ్మణు డందును 408

స్థానము - జేతవనము వ్యక్తి - అఞ్ఞతర థేరుడు

శ్లో॥ యోధ దీఘం వ రస్సంవా, అణుథూలం సుభాసుభం ।
లోకే అదిన్నం నాదియతి, తమహం బ్రూమి బ్రాహ్మణం॥

తా॥ యీ లోకమున చిన్నదిగాని పెద్దదిగాని, స్థూలముగాని సూక్ష్మము గాని శుభము గాని, అశుభము గాని, ఏ వస్తువునైనను ఈయనిదే ఎవడు గ్రహింపడో వానినే నేను బ్రాహ్మణు డందును

స్థానము - జేతవనము వ్యక్తి - సారిపుత్త థేరుడు

శ్లో॥ ఆసాయస్య న విజ్జన్తి, అస్మిం లోకే పరమ్హి చ ।
నిరాసయ విసంయుత్తం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ ఇహ-పరము లందును ఎవడు నిరాశకుడో, ఆశారహితుడు నిరాశకుడునగు అట్టి వానినే నేను బ్రాహ్మణు డందును 410

స్థానము - జేతవనము  వ్యక్తి - మహామొగ్గలాన థేరుడు

శ్లో॥ యస్సాలయా న విజ్జన్తి, అఞ్ఞాయ అకతఙ్కథీ ।
అమతోగధం అనుప్పతం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ ఎవడు తృష్ణారహితుడో, ఇంతకు ముందు చెప్పబడని మాటను అనుభవము ద్వారా గ్రహించి చెప్పునో, అగాధమగు అమృతత్వమును అనుభూత మొనరించు కొనెనో వానినే నేను బ్రాహ్మణు డందును 411

స్థానము - పూర్వారామము  వ్యక్తి - రేవత థేరుడు

శ్లో॥ యోధ పుఞ్ఞంచ పాపంచ, ఉభోసఙ్గ ముపచ్చగా ।
అశోకం విరజం సుద్ధం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ ఎవడీ లోకమున పుణ్య పాప సంగమును వదలెనో, శోకరహితుడు, నిర్మలుడు, శుద్ధుడై యున్నవాడెవడో వానినే నేను బ్రాహ్మణు డందును 412

స్థానము - జేతవనము  వ్యక్తి - చన్దామ థేరుడు

శ్లో॥ చందం వ విమలం సుద్ధం, విప్పసన్న మనావిలం ।
నన్దీభవ పరిక్ఖీణం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ సాంసారిక ఆనందము పూర్ణముగా నష్టమైనవాడును, చంద్రుని వలె విమలుడు, శుద్ధుడు, ప్రసన్నుడు మరియు నిష్కళంకుడునగు వానినే నేను బ్రాహ్మణు డందును 413

స్థానము - కుండధానవనము వ్యక్తి - సీవలిథేరుడు

శ్లో॥ యో ఇమం పలిపథం, దుగ్గం సంసార మోహమచ్చగా ।
తిణ్ణో పారగతో ఝాయీ, అనేజో అకథంకథీ ।
అనుపాదాయ నిబ్బుతో, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ యీ దుర్గమ సంసార మోహపూర్ణ మార్గము నెవడు తరించెనో, ఎవడీ భవసాగరమును దాటి ఆవలి తీరమును చేరెనో, ధ్యాన శీలుడు, నిర్భయుడు, సత్యభాషి, మరియు అనాసక్తుడు, నివృతుడునగు వానినే నేను బ్రాహ్మణు డందును 414

స్థానము - జేతవనము వ్యక్తి - సుందర సముద్ద థేరుడు

శ్లో॥ యోధ కామే పహత్వాన, అనాగారే పరిబ్బజే ।
కామభవ పరిక్ఖీణం, తమహం బ్రూమి బ్రాహ్మణం ।

తా॥ ఎవడిక్కడి కోరికలను వదలి, గృహమును త్యజించి పరివ్రాజకు డగునో, ఎవని కామనలు, మరియు జన్మము నశించినవో వానినే నేను బ్రాహ్మణు డందును 415

స్థానము - వేణువనము వ్యక్తి - జోతిక థేరుడు

శ్లో॥ యోధ తణ్హాం పహత్వాన, అనాగారే పరిబ్బజే ।
తణ్హా భవ పరిక్ఖీణం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ ఎవడిక్కడ తృష్ణను వదలి గృహమును త్యజించి పరివ్రాజకుడగునో, ఎవని భవ తృష్ణలు నశించునో వానినే నేను బ్రాహ్మణు డందును 416

స్థానము - వేణువనము వ్యక్తి - ఏకనాట పుత్రుడు

శ్లో॥ హిత్వామానుసికం యోగం, దిబ్బం యోగం ఉపచ్చగా ।
సబ్బయో॥ విసంయుత్తం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ మానసీయము, దివ్యమునగు భోగములనేగాక సకల భోగముల వదలిన వానినే నేను బ్రాహ్మణుడందును 417

శ్లో॥ హిత్వా రతించ అరతించ, సోతి భూతం నిరూపధిం ।
సబ్బలోక విభుం వీరం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ రాగ విరాగముల వదలిన వాడును, శాంతుడు, క్లేశ రహితుడు మరియు సకలలోకముల జయించు వీరుడు నగు వానినే నేను బ్రాహ్మణు డందును 418

స్థానము - జేతవనము వ్యక్తి - వగసి థేరుడు

శ్లో॥ చుతిం యో వేదిసత్తానం, ఉప్పత్తించ సబ్బసో ।
అసతం సుగతం బుద్ధం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ ఎవడు సత్వముల యొక్క ఉదయ - వ్యయములను అన్ని విధముల చక్కగా తెలిసెనో, ఎవడు నిరాసక్తుడు, మరియు బుద్ధుడో వానినే నేను బ్రాహ్మణు దందును 419

శ్లో॥ యస్స గతిం న జానంతి, దేవా గంధబ్బ మానుసా ।
క్షీణాసవం అరహంతం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ఎవని గతి దేవ గంధర్వ మానవులకు తెలియ శక్యము గాదో, క్షీణాస్రవుడు, అర్హతుడునగు అట్టి వానినే నేను బ్రాహ్మణు దందును 420

స్థానము - వేణువనము వ్యక్తి - ధర్మ దిన్న భిక్షుణి

శ్లో॥ యస్స పురే చ పచ్ఛా చ, మజ్ఝే నాత్థి కిఞ్చనం ।
అకించనం అనాదానం, తమహం బ్రూమి బ్రాహ్మణం ॥

తా॥ ఎవనికి వెనకా ముందు మరియు మధ్య ఏమియు లేదో, అకించనుడు, అపరిగ్రహుడు నగు అట్టి వానినే నేను బ్రాహ్మణు దందును 421

స్థానము - జేతవనము వ్యక్తి - అంగులీమాల థేరుడు

శ్లో॥ ఉసభం పవిరం వీరం, మహేసం విజితావినం ।
అనేజం నహాతకం బుద్ధం, తమహం బ్రూమి బ్రాహ్మణం॥

తా॥ ఎవడు వృషభుడో (శ్రేష్ఠుడు) ప్రవరుడు, వీరుడు, మహర్షి, విజేత, నిర్భీకుడు, స్నాతకుడు మరియు బుద్ధుడో వానినే నేను బ్రాహ్మణు డందును 422

స్థానము - జేతవనము వ్యక్తి - దేవాంగక బ్రాహ్మణుడు

శ్లో॥ పుబ్బే నివాసం యో వేది, సగ్గా పాయంచ పస్సతి ।
అథో జాతిక్ఖయ పత్తో, అభిఞ్ఞా వోసితో ముని ।
సబ్బవోసిత వోసానం, తమహం బ్రూమి బ్రాహ్మణం॥41

తా॥ ఎవనికి పూర్వజన్మము తెలియునో, స్వర్గనరకముల నెవడు వీక్షించెనో, అభిజ్ఞాపూర్ణుడు, ముని, సకలపూర్ణత్వముఁ నొందినవాడు నగువానినే నేను బ్రాహ్మణు డందును 423

—*—

# ధమ్మపదే వగ్గాన ముద్దానం

శ్లో॥ యమకప్పమాదో చిత్తం, పుప్ఫం బాలేన పణ్డితో
అరహన్తో సహస్సంచ, పాపందణ్డేన తే దస ॥

శ్లో॥ జరా అత్తాచ లోకేచ, బుద్ధోసుఖం పియేనచ ।
కోధోమలం చ ధమ్మట్ఠో మగ్గవగ్గేన వీసతి ॥

శ్లో॥ పాకిణ్ణం నిరయో నాగో, తణ్హా భిక్ఖుచ బ్రాహ్మణో ।
ఎతె ఛబ్బీసతి వగ్గ, దేసితాదిచ్చబంధునా ॥

తా॥ యమక, అప్రమాద, చిత్త, పుష్ప, బాల, పణ్డిత, అరహంత, సహస్ర, పాప, దండ వర్గములు పది

జర, ఆత్మ, లోక, బుద్ధ, సుఖ, ప్రియ, క్రోధ, మల, ధర్మస్థ, మార్గ వర్గములు ఇరువది

ప్రకీర్ణక, నిరయ, నాగ, తృష్ణా, భిక్షు, బ్రాహ్మణ వర్గములు మొత్తము ఇరువది యారు బుద్ధుని అనుయాయులచే ఉపదేశింపబడినవి

సమాప్తం

—[*]—

